తెలంగాణ గ్రంథమాల, ప్రచురణము:- ౧.



# జైలు

(కథల సంపుటి.)

గ్రంథకర్త:-

పొట్లపల్లి రామారావు.

ఆంధ్ర పబ్లిషింగ్ కంపెని.

సుల్తాను బజారు హైదరాబాదు. దక్కన్.

జులై 1945, వెల 0-8-0

# విషయసూచిక

# మనవి

ఎన్నో సంకల్ప, వికల్పాల తరువాత నేడీ కథాసంపుటిని పాఠకలోకానికి అందీయగలుగుతున్నాం.

పాఠక లోకం దీన్ని ఏవిధంగా ఆదరిస్తుందో తెలియదు. మామూలుగా ఒక వ్యక్తిని తృప్తిపరచడమే కష్టసాధ్యమైన పుడు, నానాదృక్పదాలతో, నానాఆశయాలతో, నానారుచులతో, ఏర్పడిఉన్న పాఠక లోకాన్ని సంతృప్తిపరచడము కష్టసాధ్యము అవుతుంది,

అయిన ఒకమాటమాత్రము గట్టిగా చెప్పగలము. మేమీకథాసంపుటిని ప్రకటించి యింతో, అంతో సాహిత్యాభ్యున్నతికి తోడ్పడ్డామని. ఈవిషయము మాటలకన్న కాలమే నిర్ణయించగలదని మానమ్మకము.

నేడు ఎన్నోదిక్కులనుండి, ఎన్నోరంగాలనుండి, ఎన్నోహస్తాల నుండి కుప్పతెప్పలుగా అచ్చుఅయిన కాగితాలు వచ్చి పాఠకునిపై పడుతున్నాయి. ఈ కాగితాల గుట్టలోనుండి సారగర్భమైన వాటినే ఏరుకోవడం పాఠకుని కర్తవ్యం.

ముఖ్యంగా మేము సాహిత్యాభ్యున్నతికి తోడ్పడే రచనలనే ప్రకటించాలని నిశ్చయము చేసుకున్నాము. అభ్యున్నతిగోరే రచయితలందరు మాకుతోడ్పడుతారని ఆశిస్తున్నాము.

మాకీ కథాసంపుటిని దయచేసి గ్రంథమాలకార్యక్రమానికి తోడ్పడ్డ శ్రీపొట్లపల్లి రామారావుగారికి, ఉదారవిరాళములిచ్చి ప్రకటనకు తోడ్పడ్డమిత్రులకు,

దీనిలో కథలు-తెలంగాణా-ఆంధ్రకేసరి తెలుగుతల్లిపత్రికలలో ప్రచురింపబడినవి. ముద్రించుకొనుటకు అనుమతి యిచ్చినందుకు వారికికూడ కృతజ్ఞత తెలుపుచున్నాను.

యిప్పట్లో యింతకన్న వేరే నివేదించేదేమి లేదు.

పాఠకుల సహాయప్రోత్సాహాల మీదనే గ్రంథమాల భావి ఆధారపడి ఉందని తుదిమాటగా చెప్తూ, యింతటితో సెలవు పుచ్చుకుంటున్నాము.

తెలంగాణ గ్రంథమాల
చినపెండ్యాల
వివరములకు, పోస్టు ఘణపురం
స్టేషన్ N. S. R.

ఇట్లు
సంపాదకులు.

శ్రీ పార్థివ. జ్యేష్ఠ శు॥ 2 లు.

# అడగనిదే తల్లిఅయినా పెట్టదు

పిల్లలువస్తే పైనబడి గందరగోళంచేస్తారని, చేసినఫలహారం గదిలోదాచి, నాడు యేమివిశేషాలు లేనట్టుగా, గదితాళము నొక్కబోతుంది శేషమ్మ. అనుకున్నట్టుగానె "అమ్మా" అంటు దూరాన్నుండె కేకవేస్తువచ్చి. "నీవుచేసిందేదో తెలిసిందిలే' అన్నట్టు నిలువున తల్లికండ్లలోకి చూస్తు నిలువబడిపోయాడు' రాఘవు.

'ఏమిరా అట్లాచూస్తావేమి' ? శేషమ్మఅంది.

'కళ్లమూసుకుంటేయిస్తావా'

'ఏమియివ్వను'?

'నావెనుక అన్నకు యిస్తావెచాటుగ'

'ఓరివెధవ! వెనుకవచ్చినవాడికి వెనుకయిస్తే చాటవుతుంది'

'చాటుకాదె .... ప్రేమ ........'

'ప్రేమ నీమీద లేదు'

'నామీద బాగానేవుంది కాని .... యెక్కువ అన్న ........'

'పాడుబుద్ధి.... పోదు!' అంటు రెండుపకోడీలు రాఘవుచేతి కిచ్చింది శేషమ్మ.

'కాని అమ్మా ఆ మిగిలినవెవరికే'?

'అన్నకుయివ్వద్దు'

'అమ్మా? నేను బళ్ళోపాఠము తప్పులులేకుండా రాసాను. నా-కెక్కువ యివ్వవు'?

'అన్నకేం తక్కువ చేశాను'

'అన్నకు ఏమి తెలుసె అమ్మ ఆయనదోటియిచ్చావని'
'తెలియకపోతె మాత్రము తక్కువయిస్తానా'?
'అసలు అన్నయ్యఅడుగుతాడె'
'అడిగినవాండ్ల నోట్లోఅంతావేస్తె....అడిగనివాళ్లు....'?
'యేమైతారు....బావుంటారు;... అన్నయ్యకుయివ్వక ఊరో ఏమైతాడోచూస్తాం'
'నీకు మరోటియివ్వకపోతె'?
'గదితాళను చీలతోతీసి' ....
'అన్నయ్య అంతమాత్రముచేయడనేనా .... తక్కువయినవంటున్నావు'!
'అదికాదమ్మా! నేనుచదువుకుణ్ణవాణ్ణి....అన్నయ్యకుఏమొచ్చేదున్నలుపాలము'
'చదువుకోనడం ఏర్పడకుండా తాళాలుతియ్యడాని కేనా'?
'కాదు....బురద దున్నడానికి'?
'బురద .... పూయడానికి' శేషమ్మ నిందుగాఅంది. రాఘువు కళ్లలో నీరుగ్రుక్కుకొని 'ఈమాత్రంబదులు ఎప్పుడైన తీర్చుకుంటాలె, అన్నంత కోపంతో కడసదాటాడు. శేషమ్మ కొడుకును అట్లా చకిలము ముక్కకోసరం ప్రాధేయపెట్టి, తిరుగు ముఖంతో పంపినందుకు మెత్తపడిపోయింది. రెండంగల్లో కొడుకునందుకొని 'యిటుచూడు' అని రాఘువు కళ్ళలోకిచూచింది. రాఘువు తల్లిబల్లోనక్కి కిత, కితలు, పెట్టాడు. యిదిగో అన్నకు ఒకటేఉంది, అని ఓచకిలం రాఘువుకుయివ్వబోయింది శేషమ్మ.
'నేనేతీసుకుంటా' నన్నాడురాఘువు
'దొంగవు ....'

శేషమ్మ 'పెద్దదేదోతీసుకోమ్మన్నట్టుగా'నిబ్బరంగావడిచాపింది. రాఘవు రెండుఅందుకొని బయటపడ్డాడు.

'వెంకుకేట్లా' అన్నట్టు శేషమ్మ నివ్వెరపోయినిలిచింది. వెంకు పొలమునుండి ధాన్యము తోలుకొని చాల రాత్రికివచ్చాడు. శేషమ్మ ఆనిద్రరాత్రి చకిలాల మూకెమరచి వండినవాల్గుమెతుకులు కొడుకుముందు పెట్టింది. వెంకు తనకుపెట్టిన పదార్థాలుతప్ప యింట్లోవేరె విశేషాలుతేసట్టు తిని కళ్లుమూసాడు. తల్లిఒళ్లోనె అమాయకత్వం అలవడింది వెంకుకు. చిన్ననాడు తల్లి పాలిచ్చి పొలముపనులకు పోయేది. సాయంత్రము వేళ యింటికితిరిగి వచ్చేవరకు, ఆఒంటరి తనములో ఏదోఆనందము అనుభవిస్తున్నట్లు కడుపునిండా పాలుగుడిచిన ఆనిసుగు ఆడుతు ఉండేవాడు. తల్లి కొడుకును ఎత్తుకొని, 'నాదేవత' 'నాఋషి' అని రొమ్ముకు అదుముకొనేది. తల్లి హృదయాంతరాళాల నుండి పొంగివస్తున్న ప్రేమోద్వేగము, అంతప్పటినుండె ఆచిన్నహృదయము అనుభూతంచేసుకొని పొంగిపోయేది. యికఅదే పనిగా యింటికివచ్చిన పేరంటాండ్రతో, తనకొడుకు అమాయకుడని, ఆకలిఅయిన ఏడ్వడని, పూర్వజన్మాన ఎవరో ఋషి అని, ఏమేమొ పొగడ్తు పొయ్యేది శేషమ్మ. ఒక్కొక్క యేడు పైనపడ్డాకొద్ది, ఈవాక్యాల అర్థం స్పష్టంగానో, అస్పష్టంగానో అర్థమౌతుపోయింది వెంకుకు. తననుగూర్చి యితరులుపడేఅభిప్రాయాలు విలువైనవని అనుకునేవాడు. చాలవరకు స్వంత కోరికల, అలవాట్ల, చంపుకుంటాడు. వెంకుకు వేళమీరి ఆకలైన, తననెవరైన అకారణంగా బాధపెట్టిన, తనకేదైన కావలసివచ్చిన, తనఉద్వేగాన్ని, ప్రతీకారాన్ని, పైవాళ్ళమంచికోసరం ఎంతోబలిమిగా లోలోన అంచుకునేవాడు. ఆతని

విషయం ఆతనికున్నఅజ్ఞానం. పోగా (instincts)ను చంపు కొనగా మిగిలిన మానం రాను రాను, ఆతనిప్రకృతిగా మారి పోయినాయి. అమాయకులని మనము జాలిపడే వాళ్ళలోనూ టికి, నూరుమందికి కోరికలుంటాయి. ఆకోరికలను పూర్తి చేసు కొనె చొరవ, శక్తి లేక తమ ప్రవత్తులపైన అమాయకత్వమనే ముసుగు కప్పుకుంటారు. అసలుకోరికలులేనివాడు 'జడము' అనిచెప్పాలె. అమాయకుడని, ఓర్పుకలవాడని, నలుగురు నోట్లోపడిపోయినందుకు, పాచిమెతుకులువేసిన, ఏవిధమైన అస హ్యత లేనట్టుగా తినేవాడు వెంకు. తమ్ముడితో బంతికూర్చు న్నప్పుడు తనదిపోగా, వెంకుపళ్ళెరములో ఏమైన మచ్చమైన ఫంటకము ఉంటె నాకుకావాలంటు ఏడ్చేవాడు రాఘవు 'పెట్టనా'? అని తల్లి అడిగేది. తనకు తినాలని హృదయము గుంజుతున్న, కావాలని కళ్ళుచంచలముగా చూస్తుఉన్నా, ఏవి ధమైన మమతలేని వాడివోలె 'పెట్టు, అనితలఊపేవాడు. తనకుకావలసింది పోగొట్టుకోవడమేగాక తాను చీదరించుకునే తమ్ముడివెంగిలి మెతుకులు. మిగిలినకూరలు కళ్ళు మూసుకొని తినవలసివచ్చేది. మధ్య, మధ్య, తల్లిపొగడ్తలె లేకపోతే, ఆయాతన, ఆఓర్పు, యింక ఎంతదుర్భరంగా మారేవో!

శేషమ్మ ఒకసారి వెంకును, రాఘవును, తీసుకొని తీర్థానికి పోయింది వెంకుకెన్ని రోజులనుండో రాగమాల కొనుక్కోవా లని, రాత్రులు కుప్పలవద్దికి కావలిపోతు, సాయంత్రము గేదె లవెనుక యింటికివస్తు. రాగాలాపన చేసి తోడివాళ్ళ మురిపిం చాలని కలలుకంటు ఉండేవాడు. ఎన్నిసార్లో నిద్రలోరాగ మాల కొనుకున్నట్లు. కలలుకని తెలివివచ్చినపిదప ఆతీయని తలపుల తలచుకొని నిరాశతోక్రుంగిపోయేవాడు, యిప్పటీర్థానికి

పోతు తోంది వపొడుగున 'ఎవరు రాగమాలలు కొనేవారు రారని దుకాణాల వాళ్ళు తేనే తేరేమో' ఒకవేళ తెచ్చిన నాదగ్గర చూడలేక బలిమిగా ఎవరైన లాగుకుంటారేమో, అని తపన పడ్డాడు.తుదకు ఎట్లాగో ఓరాగమాలచిక్కింది. రాగమాల చిక్కిందన్నమాటేకాని తమ్ముడుచూస్తె ఏమైతుందో అనేభయం మొదలయింది వెంకుకు. యికనిత్యం పొలము పోయినప్పుడు నిశ్చింతగా పాడుకొని సాయంత్రము తలగుడ్డ మాటునో, నడుముచుట్టో, దాచుకునేవాడు. కాని వెంకు కట్లాదాచుకొని తిరగడం ఎంతోభారంగా తోచింది. 'నాదినేను ఎందుకు దాచుకోవాలె?' 'తమ్ముడు అడుగుతాడా?' 'నాది నేనుయివ్వను' అని అనలేనా అని మనసు పదిలపరచుకొని ఓ రోజు ఇంటికి పాడుతువచ్చాడు. వెంకు చేతులో రాగమాల చూడటంతోనే తల్లివెనుక బడ్డాడు రాఘువు. శేషమ్మను నీళ్లు తేనివ్వకుండా చింగుల్లో దూరి తిక, మకలు, పెట్టఆరంభిచాడు. అక్కడికి శేషమ్మ వినిపించుకోకుండా పోయింది.

'రాఘువు ఆగలేక ఏమిచేస్తానో చూడు' అంటు తెచ్చిననీళ్లు తెచ్చినట్టు పారపోయడం ఆరంభించాడు.

శేషమ్మ నిలువెల్లమండి పోయింది. కడవ క్రిందపెట్టి ఈచ్చి వెన్నుపై చరిచింది. మళ్ళి అదేపగు! రెండురోజులు కనపడకుండా పోయాడు రాఘువు. రాఘువు కనపడకుండా పోయేవరకు 'ఎక్కడపడిచచ్చాడో' అనేభయం పుట్టింది శేషమ్మకు. తిండి తినక ఊరంత పిచ్చిదానిలా తిరిగింది. తుదకు మామిడితోటలో ఓచెట్టుపైన ఉన్నాడని తెలిసింది. వాడికిరాగమాల యివ్వంది వినడని మెల్లగావెంకుదగ్గరికి పోయింది. ఏమి తెలియనట్టు ఈ చర్యలన్ని గమనిస్తు ఉన్న వెంకుతల్లి ఎందుకువచ్చిందో గ్రహిం

చుకున్నాడు. రెండు రోజులనుండి నిద్రలేక, దీనమైపోయిన తల్లిమోము చూచేవరకు, నిలువున హృదయం కరిగిపోయింది. మాట్లాడకుండా రాగమాల తల్లికందిచ్చాడు.

**2**

దినాలు గడుస్తున్నాయి, రాఘవు, వెంకు, వివాహాలు అయిపోయినాయి. రాఘవుకు పట్టణములో క్లర్కు ఉద్యోగం దొరికింది. ఆతను భార్యతో అక్కడేఉండి పోయినాడు. వెంకు నెత్తిపైన తమ్ముడి చదువుకైన అప్పుకూలింది. వెంకు మత్సరం అనేది లేక వల్లువంచి పనిచేస్తేది. ఎంక, నీకలు, నిద్రా సుఖాలు ఆతనికి చిన్ననాడె దూరమై పోయినాయి. స్వక్షేమం, స్వలాభం మరచి గుడ్డిగా కృషిచేయుటమే ఆతని విధియైపోయింది. యికఫలితంమాత్రం వెంకు అధికారం, అక్కత, లేకుండా ఖర్చుఅయిపొయ్యేది. పైకి ఎంతమానం వహించిన తన కష్ట ఫలితము ఏమైపోతున్నదో ఓకంటచూస్తునె ఉన్నాడు వెంకు. తన అవసరాలు, అక్కరలు, ఏవి అడగకుండా తమ్ముడి సైకిలుకు, సినిమాలకు, తన కష్టార్జితము, ఎందుకు పంపాలో ఆతనికి అర్థంకాలేదు. ఆతనిహృదయములో రాత్రింబవళ్ళు యిదే ప్రశ్న కలతపెట్ట దొడగింది. ముఖ్యంగా వివాహం అయిన దగ్గరనుండి వెంకు స్థితి చాలమారిపోయింది. తానుచదువుకున్నవాడిలా, గౌరవంగా, స్వతంత్రంగా, బ్రతకాలనే కోరికలు నానాటికి ఎక్కువ కాదొడగినాయి. తానుకష్టపడుతున్నప్పుడు, తానుచేమట ఓడుస్తు ఉన్నప్పుడు. సుఖాన్ని కోరుకోవడము లో తప్పేముంది. కాని చిన్నప్పటినుండి తనలో యింకపోయిన చేతగాని తనము, మతిక వచ్చేవరకు ఎట్లా అని కృంగిపోయే వాడు. వెంకు తన హృదయములో ఉన్న బాధ, అసంతృప్తి,

ఎవరితోనైన చెప్పి సలహా అడగాలనుకున్నాడు. ముఖ్యంగా ఆతని బలహీన హృదయము ఓ(guide) కోసరం వెతుక్కో-వడం మొదలు పెట్టింది. భార్యముందు తనహృదయ క్షోభ విప్పివేయాలనుకున్నాడు. కాని కొత్తగావచ్చిన భార్యముందు తన అసహాయతను, కించిదత్వాని, బయిట పెట్టలేక పోయ్యాడు.

వెంకుభార్య రవణమ్మ చాలచురుకైనమనిషి. ఓ పెద్దకుటుంబములో నుండి వచ్చిన పిల్లకాబట్టి, కుటుంబములోని మర్యాదలు, మర్యాలు, ఆచారాలు, అలవాట్లు, అన్ని చిన్ననాడే హృద్గతము చేసుకుంది. తనభర్త అనుభవిస్తు ఉన్న కష్టము, తన మరిదికి జరుగుతున్న మర్యాద. తన అత్త చూపుతున్న అసమత్వము యివన్ని ఆమెమనసుకు తగిలినాయి. యిక భర్త విషయం కూడ ఆమె గ్రాహ పకరిను. వెం. హృదయములోని ఆవేదన కళ్ళలోని అసంతృప్తి, ఆమె ఎప్పుడో గ్రహించిది. యికపరస్పర హృదయాలు విప్పి ఒకరిబాధను. ఒకరిముందువల్లించుకోవడమే మిగిలిపోయింది.

శీతాకాలపురాత్రులు. పట్టణమునుండి వచ్చినరాఘవు అప్పుడే గురుకుతీస్తున్నాడు. కుప్ప నూర్చివచ్చి మామూలుగా స్నానానికి కూర్చున్నాడు వెంకు. గంగాళములోనుండి చన్నీళ్లు పోసింది రవణమ్మ.

'చన్నీళ్లుఎందుకు'? వెంకు తలఎత్తాడు. 'ఉడుకునీళ్లు తమ్ముడికి 'ఏమి'?

'అవును .... ఉడుకువాళ్లకు, ఉడుకునీళ్ళు, చల్లని వాళ్ళకు చన్నీళ్ళు' వెంకుకు ఎక్కడో దెబ్బ తగిలింది. పైనుంచి చన్నీళ్లు పడుతున్న ఏమాత్రము ఫీలుచేయక స్తబ్దుడై పోయాడు.

చాలసేపటికి తేరుకొని 'ఏమిచేయమంటావు'? అన్నాడు.
'ఏమిచేయకండి .... అమ్మచెప్పినట్లు .........'
'కాదు ... నీవుచెప్పు'
'ఏమిచేస్తారు .... మీరు మీఅమ్మ .... మీతమ్ముడు'
'నీవెవరు....'?
'నేనెవరైన మీఅమ్మనౌతానా'?
'అట్లాకాదు నీవేమి మాట్లాడుతున్నావో నాకు తెలియ........ దంటావా'?
'తెలిస్తె ఊరుకున్నారేమి. తెలిసిగూడ తెలియనట్లు ఊరుకోవడంకన్న తెలియకపోవడం మంచిది. అసలు నాతల్లిగూడ నన్ను మీలాగ పెంచితె ఏబాధ లేకుండా పోవును ........'
'నాతల్లి నీలాగ పెంచిన ఏబాధి లేకుండా పోవునేమో'....వెంకు నవ్వాడు,
'మీకోటవాళ్ళను ఎట్లా పెంచాలో అట్లాగె పెంచింది. మీ అమ్మ, ఆకలైన ఏడ్పులేని మునుల, కోపమొచ్చిన చూపలేని ఋషుల, తల్లులు యిట్లాగె ప్రేమిస్తారు. మీతమ్ముడు మీ లాంటి ముని' గాడు 'ఋషి' గాడు. ఆకలైతె ఏడ్చి, కోపమొస్తెకక్కే మనషి, అందుకే మీతల్లి ఏక్షణాణ ఆయనతో ఏమి విముఖత్వంవస్తుందో అని అంతవిధేయత చూపుతుంది. తల్లి హృదయములోని ప్రేమ, ఆదరము, చనుబాలు గుంజుకున్నట్లు గుంజుకోవాలె. లేకపోతె అవియింకెవరికైన దఖలుపడిపోతాయి తల్లి ముద్దిచ్చినప్పుదు ఉబ్బినట్లె, చెంపపై వేసినపుడు ఏడ్వాలె. అంత మొరటుగా ప్రవర్తించి నందుకు ఆమె పశ్చాత్తాపపడి అట్టుచేయాలె. మీతమ్ముడుమాత్రం ఏముంది? మీచేతిల్లోని రొట్టెముక్క సునాయాసంగాదొరికినపుడె,మీసర్వస్వము ఆయ

నదైపోయింది. 'రొట్టెముక్క యివ్వడ' అనినాడు డంటే ఈ నాడు యిట్లామీకష్టఫలితాన్ని ఏఅడ్డులేకుండా ఏమాత్రము ఆలోచించ కుండా, తినేవాడుకాడు. రేపటి నుండి మీకు బాధ. అసంతృప్తి. కలినగిపుడు ప్రతివిషయములో వ్యతిరేకత, అయిష్టత చూపుతుపోండి. మీతల్లి నాకొడుకని .... మీతమ్ముడు నాఅన్నని'

'నీవు .... నాభర్తని ....' వెంకునవ్వాడు.

'యిదివరకు ముందుకాదన్నానా?'

'ఈమాత్రము నాతల్లి నాకుచెపుతే .... నాకుధైర్యంపోస్తే....

'తల్లినెత్తిపైన కూర్చునేవారు'

'నెత్తిపైన కూర్చోపెట్టుకునేవాణ్ణి'

'నన్నుఏమాత్రము కూర్చోపెట్టుకుంటారో' అంటు రవణమ్మ లోనికి వెళ్లిపోయింది. వెంకు పెదవులపైన దీర్ఘమైన నవ్వువిర సింది.

## 3

కురుక్షేత్రములోని అర్జనుణ్ని కర్తవ్యముఖం చేయడానికి క్షణ, క్షణం, హెచ్చరిస్తు పోయినట్టె, రవణమ్మ మగణ్ణి హెచ్చరిస్తు పోయింది. పాదులేక నేలపారిసతీగలు ఏదో ఆసరదొరక డముతోనే పైకిప్రాకినట్లు. రవణమ్మను చూచుకొని వెంకులోని జీవము, అహం, పైకిలేచాయి. పొద్దుపోయిన మాడుతు తల్లి కోసరం ఎదిరిచూస్తు ఉండేవాడు. 'నాఆకలి ఎరగనివాళ్ళకోస రం నేను ఎదిరిచూడటం ఎందుకు' అని భార్యతోతినడం ఆరం భించాడు. ఒకేసారి ఆయన ఈ మార్పు శేషమ్మకు విపరీతంగా తోచింది. లోనమాత్రం 'ఏదోతంత్రం పన్నుతుంది ముండా' అని తనఅనుమానము బలపరుచుకోవడం కోసరం. రవణమ్మ

నిలువంత వేయికళ్ళతో చూచి ఏమివి శేషము లేనట్టుగా మౌనం వహించింది.

ఒకరోజు రాఘవు తనకక్కడ కాఫి పాలు చాలడం లేదని గొల్ల వాళ్లు పరిశుద్ధమైనవి పోయక ఏడ్పిస్తున్నారని, కొనుక్కొట్టుకపోతా నన్నాడు. తల్లి 'సరే' అంది. కూలివాళ్ళుకూడ సిద్ధమైనారు. యింక మెడకుతగులు వేయడమే మిగిలిఉంది. ఈమాటలన్ని వింటుఉన్న వెంకు మెల్లగా, తల్లివద్దికిపోయాడు.

'ఏమమ్మా! యిక్కడ కాఫితాగేవాళ్లు లేకపోయిన చల్లత్రాగేవాళ్లు లేరా'?

శేషమ్మ వెంకుముఖం పరీక్షగా చూచింది. ఏదో తీవ్రనిశ్చయం చేసుకొని వచ్చిన వాడివోలే నిండుగా ఉన్నాడు. దిన దినము, వెంకు నడత గమనిస్తు ఉన్న శేషమ్మకు తను అనుమానిస్తున్న విషయమేదో ఈనాడు ప్రత్యక్షంగా కనపడింది. శేషమ్మ ఆ రహస్యమేదో తానొక్కతే గ్రహించినట్టు, సరేననుకొని,

'మనము గంజినీళ్లు తాగుదాము .... ఎట్లో తెల్లవారుతుంది నాయనా' అంది.

గంజినీళ్లు ఎందుకమ్మ .... మనముచల్లతాగ కూడదు'?

'తమ్మునికి కావాలంట'

'ఏమి అన్న గంజితాగుతుంటె .... తమ్ముడు కాఫితాగుతాడా'?

శేషమ్మ వెంకును నిలువున చూచింది. వెంకునిలువెల్ల కదులుతుంది. అతనిముఖంపైన ఏలాంటి ప్రబల హేతువుకైన జవాబిచ్చేఉత్సుకత ఉరుకులాడుతుంది. శేషమ్మ నోటినుండి మాటపెకల లేదు.

చాటునుండి అన్నవాదాన్ని వింటు ఉన్న రాఘవు తన ఉద్వే

గాన్ని ఆపుకోలేక 'గంజి త్రాగేవాళ్లు గంజి తాగుతారు. కాఫీ త్రాగేవాళ్లు కాఫీ తాగుతారు' ఏమి అన్నాడు.

'కాఫీ త్రాగేవాడికి గంజి త్రాగేవాడి గోడెందుకు'?

'ఆగోదె నీదా?'

'నాది కాకున్న నీదిమాత్రం కాదు,

'అయితే తీసుక పోనివ్వనంటావ'?

'తీసుకపోనివ్వను కాని, పాలు త్రాగంగ వద్దనను'

'అదైన చూద్దాము తీసుకపోండి' అని లేచాడు రాఘవు.

'కూలివాళ్ళు తగులుతో గోదెను ఈడ్వడం ఆరంభించారు.

'అమ్మా'? అన్నాడు వెంకు.

తల్లి వెంకు కళ్లలోకి జాలిగా చూసింది.

'వద్దనవు తమ్ముణ్ణి'?

శేషమ్మ రాఘవుపైపు దీనంగా చూచింది. రాఘవు తనదిసా గాలన్నట్టు బిగిసి కూర్చున్నాడు.

'సరే' అంటు లేచాడు వెంకు. రెండు అంగల్లో గోదెనందు కొని కూలివాళ్ళ నెట్టి, పొలమువైపు మళ్ళించుక పొయ్యాడు.

## 4

రాను రాను, తల్లి కొడుకులమధ్య స్పర్థలెక్కువై పోయినాయి శేషమ్మదృష్టిలో ఈస్పర్థలకు, ఈ ప్రత్యేకతలకంతా, రమణమ్మ కారణంగా నిలిచింది. ఆదయ్యేము యింట్లో కాలుపెట్టినప్పటి నుండే యింటి తీరుచెడిపోయిందని, కొడుకును చేతిలో లేకుండా చేసిందని, కనిపడ్డవారిముందెల్ల చెప్పుకోదొడగింది. కోడలి పైని, అసూయ, తనమాట చెల్లడం లేదనే నిరాశ, వెంకు 'భార్యమాటవింటున్నాడనే' కోపంగా పరిణమించింది. ఒక వంటింట్లో కుక్కకనుపించిన, పిల్లిపాలుతాగిన, చెంబుజారిపడ్డ,

వాటిఅన్నిటికి మూలకారణం. కొడుకు, కోడలు అయినట్లు, శేషమ్మ తనలో రాజుతుఉన్న ద్వేషాన్నంత వెళ్ళగక్కేది. ఒకరోజు రవణమ్మకు బదులుతిరిగిన బియ్యము పుట్టకుండా పోయినాయి. పండినధాన్యము శేషమ్మగదిలో వేసుకొని తాళం వేసుకుంది. వెంకు తనమాటవినకుండా, తనకుతానే అన్న ట్టుగా తిరగడం ఎప్పుడు ఆరంభించాడో, అప్పుడే ఆమెఆనిర్ణ- యానికివచ్చింది. 'ఎన్ని రోజులుసాగుతాయో పెత్తనాలు, యిక పెళ్ళాము తెస్తేనే తినాలె .... పెళ్ళాముమాట వినేవా డికి పెళ్ళాముపెట్టకపోతె ఎవరు పెడుతారు. అని ఆమెలో లోలోన ఆలోచించుకొని, ఏమిజరుగుతుందో, చూద్దామని వేళకోసరం ఎదిరిచూస్తుంది—ఎండకాలం .... మనుషులు యిళ్ళల్లో, పక్షులు, ఆకుల్లో, తలదాచుకున్నాయి. బయిలంత తన రాజ్యమన్నట్టు మండుతుంది ఎండ. ఆరిన నాలికతో, ఆకలికడుపుతో, యింటికివచ్చాడు వెంకు. కుడుతావిప్పి చిలు కొయ్యకు తగిలిస్తు ఉంటే అర్థయుతంగా నవ్వింది రవణమ్మ.

'ఏమిలేనట్టు!

'ఏమి యివ్వాళ్ళగూడ యివ్వలేదా!' వెంకు అన్నాడు.

'నాకెందుకిస్తారు .... మీరుఅడిగండి'

'అమ్మా! అన్నాడు వెంకు ఉద్వేగంతో. శేషమ్మ మాట్లాడ లేదు.

'ఆకలవుతుందమ్మ అన్నాడు తల్లిముందుకుపోయి.

'పెళ్ళాముపంపిందా వాదించుమని'?

'కాదమ్మా .... ఆకలి'

'దాన్నే పెట్టమను ........ '

'నీవేపెట్టాలె'

'పెట్టకపోతే'?

'నేనే పెడుతా మీఅందరికి' అంటు తలుపుతీయ బోయినాడు వెంకు.

'తలపుమాత్రము తీయకు' ?

'ఎందుకమ్మా'?

'బాగోదు'

'ఎప్పుడన్నా కొట్టావమ్మ నన్ను' అంటు తలపుతీసాడు వెంకు, శేషమ్మ వచ్చి బలిమిగా తలుపు మళ్ళీ గుంజింది. వెంకువేలు తలుపుమధ్యచిక్కి చితికిపోయింది. రక్తముకారుతు ఉన్న నమ్మ ళంగా తలుపుతీసుకొని లోనికిపోయాడు. మూడువిస్తళ్ళల్లో అన్నము వడ్డించి ఎవరికోసరమో ఎదిరిచూస్తున్నట్లు అట్లాగే ఉంది. వెంకు వెర్రివానిలా వెనుకకు మళ్ళాడు.

'అమ్మా! నీవుకూడ తినలేదు.'

శేషమ్మ హృదయము దుఃఖముతో గ్రుమ్మింది. వెంకువేలు నుండి రక్తముచుక్కలు, ఆమెకళ్ళనుండినీళ్ళు, రాలదొడగాయి. రవణమ్మ మగడి చేతి నెత్తురు, అత్తకన్నులనుండి కన్నీరు, చూస్తు పిచ్చిదానిలా నిలుచబడి పోయింది.

---

# కుక్కపిల్ల

ఆకుక్కపిల్లను ఏతల్లి కన్నదో? కని ఒంటరిదానిగా ఎందుకు చేసిందో? ఎవరికీ తెలియదు. ఆకుక్క పిల్ల మాత్రము దినమంత ఎక్కడెక్కడో తిరిగి, రాత్రి తనతల్లి పాడుగా విడచిపోయిన గడ్డివాములో తలదాచుకునేది. నిత్యము ఆయింటివాళ్ళు ఎంగిలాకులు గడ్డివాములో విసిరేది. ఆఎంగిలి ఆకుల్లో మిగిలిన మెతుకులతో పొట్టనింపుకునేది, ఆకుక్కపిల్ల. యిక గడ్డివాములో ఏదైనచప్పుడైన, గడ్డి, వరక కదలిన గంయిమంటు లేచి తన అన్నఋణాన్ని తీర్చుకునేది.

ఒకరోజు ఆయింటి పెద్దగడ్డి వాము చూడటానికి వచ్చాడు. ఎవరో, పరాయివాడు గడ్డివాములో చొచ్చినట్లు ఆకుక్క గంయ్యిమంటు ఆయనపైకి లేచింది.

దొంగముండా! నావాములో పడుకొని నామీకి లేస్తున్నావు అని కర్రతీసుకున్నాడాయన. ఆ యింటి పెద్ద చూపుల్లోని అహంభావము, అధికారము, ఆకుక్కపిల్ల గ్రహించింది. పశ్చాత్తాపముగా, తప్పు తెలుసుకొన్నట్టుగా, తోకఆడిస్తు, నీవెహాక్క! దారుడవన్నట్టుగా, ఆయనదగ్గరకుపోయింది. మాదిగ స్నేహము నీతో నేచెయ్యాలె! పో! అంటు కర్రతో దానిని తరిమి వేసాడాయన.

యిక ఆరోజునుంచి ఆయింటిపెద్ద బజారుకు పోతున్న, పదిమందిలో కూర్చున, నీవే నాయజమానివి, నిన్ను మరవనన్నట్టుగా, ఆకుక్క తోకఆడిస్తు, ఆయనను అనునయం చేసుకోబోయేది. ఆయనను వెతకడానికి పడ్డశ్రమంత ఫలించినట్టుగా, ప్రేమగా నోరు తెరచి గుర్రుమంటు ఆవలింతతీస్తేది. ముందటి కాళ్ళపైన

నేలకువరగి తన ప్రభుభక్తి తెల్పుకునేది. ఈవేషమంతా ఎవర న్నా చూస్తున్నారా అని ఆయన దిక్కులు చూచేవాడు. 'నీదే నాదే బాప'! 'ఎక్కడవరించావు తాత' దీన్ని ఎవరో పశ్నలు వేస్తు నవ్వుతున్నట్లు, ఆయనలో లోన వణికేది. 'ఎవరుదీన్ని పిలిచింది'? 'ఏమి నావెంటపడ్డదేమి దయ్యంమాదిరి'! 'ఓహో బాగానే కుదిరింది.'! 'ముదిరిపోతుందిసరసం'? అంటు ఆకుక్క- నునాల్గు బాదేవాడు. కాలుకాలిన పిల్లిమాదిరి, అది తోకను ముడుచుకొని ఉరికేది.

ఎన్నిసారులు తరిమివేసి ఆకుక్క ఆతనియిల్లును విడువకపో య్యేది. ఎప్పుడో! ఎక్కడుండో! ఆకొట్టినదెబ్బలన్ని మరచి మళ్లి యింట్లో దూరేది. ఆయింట్లో ప్రతిమనిషి ఎందుకోమరి? ఆకుక్క కనపడగానె కర్రతీసుకొని తరిమివేస్సది. దానిపైన వా ళ్ళందరికి అసహ్యాము పుట్టింది. అది కంటబడితే, ఏదోపిశా చము కనబడినట్టుగా వాళ్ళంత ప్రవర్తించేవాళ్లు.

ఈవిధంగా దెబ్బలుతింటు తనభక్తినేదో వాళ్లు పరీక్షిస్తున్నట్లు ఆపరీక్షలో తప్పక తాను నెగ్గాలన్నట్లుగా, మళ్లీ నిండుహృద యముతో వచ్చి యింటిముందు పడుకునేది. ఆయింటి రక్షణ భారము తనపైన ఉన్నట్టుగా దారినిపోయే వాళ్ళను జాగ్రత్త! అని హెచ్చరించేది. తాను ఘడియకన్నుమూస్తే ఆయింటికేమి విపత్తువస్తుందో అన్నట్టు రాత్రిఅంతా మేలుకొని కాపలాకా చేది. ఈవిధంగా పాటుపడి అయిన నాప్రభువు హృదయం కరు ణాప్లావితము చేయక పోతానా అన్నట్టు ప్రవర్తించేది.

ఒకరోజు కాకి ఆయింట్లో చంటివాని వెండిగిన్నెను ఎత్తుక పోయి గోడపై పెట్టుకొని మెతుకులు ఏరుకొని తింటుంది. కుక్క బాగాచూచింది. నేనుండగానె 'యింత అరాచకమా'

అంటూ గోడ పైకి లంఘించింది. కాకి గిన్నె విడిచి వెగిరిపోయింది. గిన్నెలోని వెంగిలిమెతుకులు చూడగానె కుక్కనోరు నీటితో నిండిపోయింది. తాను నాడుచూపిన అద్భుత స్వామిభక్తిని మరిచి గిన్నె చప్పరించడములో మునిగిపోయింది. యింతలో యింటివాళ్లు గిన్నె వెతుకుతూ వచ్చారు. కుక్క కాళ్లమధ్య గిన్నె కనపడేవరకు వాళ్ళ పాతకోపం ఆకాశంముట్టింది. 'ఓసి! నీము ఖంమండ! యిదికూడ నేర్చావు' అంటూ ఏర్పడకుండా ప్రహారీ తలుపులన్ని మూసి కర్రిలతో దానివెనుకపడ్డారు. అది తన మూగకంఠముతో ఏదో చెప్పబోయింది. కాని ఎవరికి దాని అర్థం తెలుసుకునేఅంత ఓపికఉంది. వాళ్ళంతా కసితీరేవరకు బాది దాన్ని బయిటికి తరిమారు.

ఆరోజు కుక్కకు అన్నందొరకలేదు. ఆకలికి సోలుతు అది అడవిగుండా పోతుఉంది. ఎక్కడైన, ఏదైన, తినటానికి దొరుకుతుందేమొ అని ఆతురతగా దిక్కులు చూస్తు నడకసాగిస్తుఉంది. యింతలో ప్రక్కపొదలో ఓకుందేలు కదిలింది. కుందేలును చూచేవరకు ఆకుక్క ప్రాణాలన్ని అట్లాగె ఆగిపోయినాయి. అదికదలకుండా నిలువబడి ఆపొదవైపు పరీక్షగా చూచింది. దాని ఆకలి కడుపులో ఎన్నోఆశలు, ఎన్నోరుచులు పుట్టుకవచ్చాయి. నిమ్మళంగా కాలు సడికాకుండా, ఆపొదలోని జీవాన్నిగొంతుఅందుకొంది. యిక ఆప్రాణి కదలలేదు. విజయగర్వంతో అది యింటివైపు మళ్లింది. ఈ వేషాన్నంత పందుల వేటకు వచ్చిన ఓజమీందారు బిడ్డ చూచాడు. పాపం! ఎన్నో రోజులనుంచి ఆయన పూర్వపు రాజులు, రాచకన్యల కోసరం తిప్పినట్లు కుక్కలకోసరం దేశాన్ని గాలిస్తున్నాడు. ఆకుక్క చాకచక్యం, ఒడుపు చూచేవరకు ఆత్మాదేవతా సాక్షాత్కార

మైనట్టు అయింది ఆయనకు. వెంటనే నౌకరుల పిలపించి ఆకుక్కను 'ఎట్లాగు తేవాలె' అన్నాడు. 'అంతకయితె వాడిబళ్లో ఈనాల్గునోట్లు పారవేయండి' ఓనలుబయి రూపాయిలు నౌకరుల చేతుల్లో వేసాడు. నౌకర్లు రూపాయిలు అందుకొని ఆ కుక్కవెనక ఉరక ఆరంభించారు. ఆకుక్కకు తనవెనుక పరుగెత్తుక వస్తున్న తెల్లబట్టలవాళ్ళచూచి భయంవేసింది. వీళ్లేమైన చావమోదుతారు గావును అనుకుంది. ఆకుక్క, యికతలఎత్తకుండా ఉరికి యజమాని, యింట్లో దూరింది వీధిఅరుగుమీద కూర్చొని ఈనాటకమంతా చూస్తున్నాడు. యింటిపెద్ద: కుక్క యింట్లో దూరిందో, లేదో, నౌకరులు ఎగబోస్తు వచ్చారు.
'ఏమిటి'? అన్నాడు యజమానిఎగబోస్తువచ్చిన నౌకరులచూచి.
'మీ దేనాంచి కుక్క'? 'అవును అన్నాడుగర్వంగా'
'యిస్తారా దాన్ని'?
'ఎవరికి'
'జమీందారుగారికి'
ఆయింటిపెద్ద ఉబ్బిపోయినాడు. యిన్నిరోజులనుండి తానుగడ్డిపరకగా చూస్తుఉన్న ఆకుక్క క్షణములో అలభ్యవస్తువైపోయింది. 'మహాజాగ్రత్తకలది కావచ్చు! అందుకే జమీందారుకన్నుపడ్డది. ఏమీతెలియ నట్టుగా తిరిగేది. యింకాఎన్నెన్ని షికార్లుచేసిందో, ఎవడెవడు దాన్నితరిమి నాకురావలసిన ఆభుక్తాన్ని లాగుకున్నారో'? యివన్నిలోన ఆలోచిస్తునే 'మేము యివ్వము ఎంతోవిధిగా సాకుతున్నాము దాన్ని' అన్నాడు.
'ఉత్తగా యివ్వకండి'
'ఏమి యివ్వగలరు దానికి మీరు'?
'ఆకళ్లాఅంటారేమిమీరు'

అంటు నాల్గునోట్లు చూయించారు. ఆనోకర్లు ఆడబ్బు చూచే వరకు యజమాని నిశ్చయం సడలిపోయింది. 'ఉండియేమిచే స్తుంది ఈపిశాచము .... ఎప్పుడు ఏదోగోల. పనిపాటలు లేని ఆజమీందార్లకు చెల్లుతాయి షికార్లు. నాలాటి కుటింబీ కులకు ఈసంసారయాతనే సరిపోయే .... ఎవడు పెట్టుకున్న మిడిమేలము. ఏదోపోనివ్వ' అంటు అడబ్బుతీసుకొని కుక్కపట్టి స్తానంటు లోనికిపోయి 'మనకుక్కఏదిని'! అని పెళ్ళాన్ని అడి గాడు.

'మనబ్రతుకు కోకుక్కా' అందిపెళ్ళాము.

'అయ్యో! నిత్యము మనయింట్లో తిరిగేకస్తూరి'

'చంపి పెంటమీదికి ఈడ్చాను' అందిపెళ్ళాము

'ఏమిపాడుబుద్ధులు పుట్టాయి, వినాశకాలం ఏమైన వచ్చిందా మీకు'?

'దానికిరాబట్టే అదిపోయింది' చంటవాని నూనెతాగుతే ఊర కుంటారు'?

'నూనెతాగితె చంపుతారు! పాడునూనె ఎట్లాగువస్తుంది. దానిప్రాణం'?

'అంతకావలసి ఉంటె బ్రతికించుకోపోండి' అంది పెళ్ళాము కోపంతో రుస, రుస, లాడుతు యింటివెనుకకు పోయాడు ఆయజమాని.

పెంటకుప్పపైనపడి కొట్టుకుంటుంది కుక్క. దాని పళ్ళలోనుంచి రక్తముకారుతుంది. యిప్పుడో, అప్పుడో, పోయేటట్టుగా ఉంది దాని ప్రాణం.

యజమాని చేతులోనుండి ఆనాలుగునోట్లు తిరిగిపోతు ఉంటె, వలలో పట్టపక్షులు ఎగిరిపోతున్నట్లుగా అనిపించింది. ఆయ

నక్కో, ఆరోజంతా ఆయనకు తిండిమీద మనసుపుట్టలేదు. ఏదో పోగొట్టుకున్న వానివోలె యింటికి, బయిటికి తిరిగాడు. సాయంతము పెళ్ళాముతో ఈకథ అంతాచెపుతు 'చేతిలో పడ్డ రూపాయిలు నీవల్ల నిష్కారణంగా పోయినాయని' నిట్టూర్పుతీసాడు.

'నేనేమి చేశానండి' అందిభార్య

'నీవు దాన్నిచంపకపోతే రూపాయిలు వచ్చి యుండు.

'చంపడమేమిటండి .... దానికేమైంది ఎప్పుడో లేచిపోయింది'

'లేచిపోయింది'! యజమాని నిర్ఘాంతపోయాడు. అతడు యికేమి మాటాడలేదు. పిచ్చివాని మాదిరి భార్యముఖం చూస్తు ఉండిపోయాడు.

---

# న్యాయం

మాదిగవాళ్లు వెట్టిచేయడానికే పుట్టినట్లు, వాళ్ళపిల్లాదిమేద వెట్టితోనె జీవిస్తున్నట్లు, తెల్లవారకముందే వెట్టివాణ్ని కూతలు వేయడం ఆరంభించాడు జవాను.

నీతి నియమాలు పాలించె ఉద్యోగులు తమ విధుల (వెట్టిచేయించుకొని ప్రతిఫలమివ్వడం) మరచిపోయినా వెట్టిమాదిగ, తనవంతు మరచిపోలేదు. భుక్తి కోసరం ఏ చెట్టుకో, గుట్టకో పోవలసినవాడు 'ఎట్లాగుతప్పదు' అనేకతరాలనుండి తనలో యింకిపోయిన ఓర్పుతో మెల్లగాచావడిముందుకొచ్చాడు.

'ఏమిరాపెళ్ళాము పక్కలోపడుకున్నావు'?

'ఎంతసుఖమా? దొర అది ఎప్పుడోపోయింది'

'ఏమిా! నీవుకూడ షోకపోయినావు. సర్కారిపని ఆగుతుందా'

'పోయేనాడు ఎట్లాగుతప్పదు కాని, ఉండేవరకు చేయకతప్పుతుందా దొర'

'అన్నీ సరేకాని, యివ్వాళ దొర పైనుండిదిగుతాడు. యింక నీళ్ళు నిప్పులు, ఏమిచేవు' 'కరణం ఎక్కడ పడుకున్నాడు'?

'పిలుచుకొస్తాదొర' అంటు మాదిగ వెళ్లిపోయినాడు. జవాను చావడిలో కూర్చొని సన్నగా బీడిపొగ వదలుతు కరణంపైన రాభోయే అధికారిని గూర్చిన భయం (Superiority) ఎట్లా నెలకొల్పాలో, ఆతనికెట్లాహడల్ పుట్టెటట్టుచెయ్యాలో, ఆవిషయాన్ని గూర్చిఆలోచిస్తు' తనలో లేనికోపాన్ని, అధికారాన్ని ప్రత్యేకచ్చుకోవడములో మునిగిపోయినాడు. యింతలో కరణంవచ్చి 'నిద్రకూడ పోనియ్యనట్టు ఉందే' అన్నాడు.

జవాను ఉలికిపడి లేచి కరణంముఖం తీవ్రంగాచూచాడు,
'నిద్ర యింకాఉంటే యిక్కడేపడుకోండి'
'ఏమిటి గొడవ— ఏదో ఉరి మళ్లీ'
'ఉరి ఎందుకుమీకు—అంతగాఅయితే దొరవచ్చే, ఉరిలేకుం
డాచేస్తాడు'
'నాకుపోయిన ఎవడిమెడకైన సరే—యింతకు ఏమిటి'?
'అట్లాదారికిరాండి. నిద్రయింకా ఉంది. కళ్ళునలుచుకో, తహ
సీలుదారుగారు వస్తారు ఈరోజు. మీదపర్యం తసక్కీ. యింకా
నిద్రపోతారా? కోమటిని పిలిపించు'
కరణం తలఎత్తకముందే మాదిగ కోమటికోసరం ఉరికాడు.
కరణం తలవంచుకొని చీటివ్రాయడం ఆరంభిచాడు.
'ఏమిరాస్తున్నావు?
'ఎప్పుడు రాసేవే—కొత్తాయిన్నాళ్ళ'
'నీవుకొత్తమనిషిలాగానె కనపడుతున్నావు — గుర్రం కూడ
ఉంది వెంబడి'
నాకేమి పోతుంది రాయటానికి' అంటు, శెనిగలు, బియ్యము,
గోధుమలు, నెయ్యి, మసాలా, ఉప్పు, అంటు చీటీవ్రాసి
అప్పుడేవచ్చిన కోమటిచేతి కిందిచ్చాడు కరణం. కోమటి బాగ
చూచుకొని
'ఏమిచెయ్యమంటారు నన్ను, అన్నాడు.
'నన్ను ఏమంటావు అయన్నుఅడుగు' అన్నాడు కరణం
'ప్రతివాడు ఉత్తగాతినడమేనాయె—ఏమి యివ్వక తినిపోతె
ఏమియివ్వకుండానె సామాను దొరుకుతుందా'?
'యిన్నాళ్ళనుండి ఎట్లాయిస్తున్నావు'? జవానుగదిమాడు
'యిన్నాళ్ళనుండి ఎట్లాతింటున్నారో, అట్లాయింకాతింటారా'?

'పైన మొత్తుకో'
'యింకెవరున్నారు పైన—పైవాళ్లే తిని పోతుంటె— దేవుడా? ఆయనభయం పోయింది'
'లేకపోతె దావాచేయి'
'చీటీలు యివ్వడంతోనె సామానుదొరకినట్టు, దావాచెయ్య డంతోనె న్యాయం దొరుకుతుంది'
'మరేమి పొద్దుపోగొడుతువా'
'నాయింట్లో ఏమున్నతెచ్చుకోండి పైకుండి వచ్చే ఆయనకే చూపెడుతాను నాయిల్లు'
'దొంగసర్లు .... తక్కువబొట్లు ఏమైన ఉంటే'
'ప్రపంచములోని అబద్ధము, మోసము, అంతాకోమటి వాని యింట్లోనెఉంది'
'పంతులు నీయిష్టం— పొద్దుపోయిన తరువాతమాత్రం' కోమ టితోవాదించలేక కోపంతో కరణంవైపు తిరిగాడు జవాను.
'నాగయ్యా! అట్లాఅనకు, యిన్ని రోజులనుండి లేని దారిద్ర్యం యివ్వాళనే వచ్చిందా! ఏదోకానివ్వు. నీయింట్లోమాత్రం ఉన్నాయా' సణిగాడు కరణం
'ఏమొ! మనుషులకంటె పెట్రోలుగాని, గుర్రాలకెక్కడతెచ్చేది గడ్డితినేవాటికి గూడ పెట్టేవాణ్ణి చూడగానె రుచులూరు తాయిగావను'
'రేపు మోటార్లు వస్తాయి—అప్పుడు'? అన్నాడు జవాను
'ఆముదంత్రాగి నడిచేవైతె మాదేముంది— అలిమినైన బలి మినైన పోస్తాము'
'కాదు పెట్రోలు కొనిపెట్టాలె'
'పెట్రోలుకొని మీరే యింటికివెట్టిపోండి' అంటు యిదివరకు

ప్రతిఆఫీసర్ వచ్చినపుడు గోణిగినట్లే గొణుగుతూ సామాను
యివ్వడానికి వెళ్లిపోయాడు,
సామాను రావడం తోనే 'కోడి కోడి' అంటూ ఆరాటం చేయ
ఆరంభించాడు జవాను. అధికారులకు కోడిగుడ్లు కావలసి వచ్చి
నపల్లెలపై విరుచుక పడుతారు. రాజుగారు వేటకువచ్చిన, మం
త్రివిహారార్థము వచ్చిన విందులైన, వినోదాలైన, అన్ని పల్లె
లేభరించాలె. మళ్లీ ఆకోళ్లకు, గొర్రెలకు, ఆవెన్నకు, ఆమీంగ
డకు,డబ్బు వేళకొద్దిగా ఖజానుండి బయిటకొస్తుంది. ఎవారిలో
వక్క నీరు యింకిపోయినట్లు, ఏఅధికారి జేబుల్లోకి అధనము
జారిపోతుందో ఎవరికి తెలియదు.
కరణం యిదివరకు వంగకోళ్ళు యిచ్చిన వాళ్లను సాక్షిచేసుకుం
టుఎంతకు తెగాలక 'ఎవడివంతుగా'? అని మాదిగను అడి
గాడు
'[illegible]'
'అయితే బిచ్చగాళ్ళ పట్టుకరా' తలవంచుకొని పోయినాడు
మాదిగ ఊళ్లోకి వస్తే ప్రతిఅధికారి మొదట బిచ్చగాళ్లపై
పడుతాడు మామూలుగా ఈబిచ్చగాళ్లు (Criminal Tribes)
అయికుంటారు. యీకవాళ్లు (Criminal Tribes) అనే లోకప
తనం అధికారులకు ఎన్ని విధాలగానో ఉపయోగ పడుతోంది.
ఎన్నడో పూర్వము వాళ్ళతాతలో, ముత్తాతలో, కన్నగాపై
బందిపోట్లు అయినందుకు, పాపలఅమ్ముకొని, ధాన్యంగ్రాసన్న
కొని వ్యవసాయంచేసుకొని బ్రతికేవాళ్ళు సంతతులుగూడా
(Ciiuiinae Tribes) గానె ఉండిపోయినాయి. యీకకాలం
టికష్టజీవులనుండి స్వలాభంకోరకు (Crimes) చేసే ఉద్యోగు
లుమాత్రము న్యాయమూర్తులుగా చలామణీ అవుతారు.

బిచ్చగాళ్ళకోసరము పోయిన మాదిగ అంతా పసులకు పోయారంటు నురలివచ్చాడు. జవానుముఖం ఎర్రబారింది. 'కోడివస్తుందికదా' అనే ఆతని ఎదిరిచూపు ఏర్పడని కోపంగామారింది.

'ఏమిరా' అని చావడిలోనుండి బయిటికివచ్చాడు జవాను. మాదిగప్రాణం నిలువున కదిలిపోయింది 'ఏమి! వాళ్లుపనులకు పోతె కోళ్లుగూడ పోయినావా వెంబడి' అంటు చెంపపై అందుకున్నాడు మాదిగ తలతిరిగిపోయింది. పడపోయినవాడు సవరించుకొని యింటివైపు ఉరకడం ఆరంభించాడు.

'కక్కడ నిలవబడు–చంపేస్త' అన్నాడు జవాను.

రాతివిగ్రహం నిలచినట్లు నిలచి పోయినాడు మాదిగ

'ఎక్కడికి పోయినారురా వాళ్ళు చెప్పు' జుట్టు అందుకున్నాడు జవాను.

'ఉన్నారండి' మాదిగవణక ఆరంభించాడు.

'ఉంటె లేరనిఎందుకొచ్చావు'?

'తప్పైపో' అంటుకాళ్ళు పట్టుకోపోయినాడు మాదిగ.

'కోడితీసుకొని క్షణములో వస్తావా?

'అయ్యా' అంటు తలఊపాడు మాదిగ జుట్టు వదలి పోయింది పైకెగసివస్తుఉన్న కోపాన్ని. దుఃఖాన్ని, లోలోనఅణచుకుంటు ఉన్నత్తునమాదిగ బిచ్చగాళ్ళ గుడిసెలముందు కురికాడు.

కోళ్ళన్ని పెంటలపైన ఏరుకతింటున్నాయి. ఎవడిదైనకానియ్యి అంటు గుట్టిగా చేతికర్ర విసిరాడు. కేయ్! మంటు పెంటపైన ఓపుంజు కూలింది. కోళ్ళచప్పుడు కావడంతోనె గుడిసెలవద్దకా

వలిఉన్న ముసలి పరుగెత్తుకొని వచ్చి మాదిగ కాళ్ళపై బడి పోయింది.

'మనిషిప్రాణమంటన్న ఎక్కడవనా-నీకొడి? అంటు ముసలిని ఓపక్కకు తోసి మాదిగ విడలించుకపొయ్యాడు.

వంటలు అయిపోయినాయి. తహశీలుదారు వస్తున్నాడని విని తమకష్టసుఖాలు చెప్పుకోవడానికి, రైతులంత చావడిదగ్గర మూగి ఎదిరిచూడ దొడగారు. అంతకంతకు పొద్దు పడమటికి కృంగుతు పోయింది. రైతులు తిళ్ళు, తినక పనులకుపోక, ఎప్పుడువస్తాడో అనే ఆతురతలో అట్లాగె ఉండిపోయారు. కొందరు 'దొరవస్తె లేపరా' అని ఆచెట్లనీడల తలలువాల్చారు. కొందరు కూర్చొని కునికిపాట్లు పడదొడగారు. కొందరు ఏవోముచ్చట్లు ఆరంభించారు.

'అరేయి-ఈజవాను అప్పుడేగురుతిస్తున్నాడు. ఒకవేళ్ళ దొరవస్తె'? ఒక రైతుఅన్నాడు.

యింకేమివస్తాడువండింది తినేశాడు' అన్నాడు. మరో రైతు.

ఏమిపెడుతాడు. ఒక వేళవస్తే.?

రాడుకాబట్టే అన్నాడు.

అయితె యివాళరాడు! అయినాచెప్పడేము'

'రాడనిచెపితే కమ్మగా ఎవడు పెడుతాడు'

'అయితె ఒక్కడి పొట్టకోసరం యింతమందిని ఏడ్పిస్తాడా'?

ఏమిచేస్తాము-నమ్మకము లేకున్న నమ్మాలె ఎన్నిసార్లు యిట్లాం దినాలకొద్ది చావడీముందు ఎండలో కునికిపాట్లు పడలేము'

'సరే బావుంది-కళ్ళములో గింజలు అట్లాగె ఉన్నాయి' అంటు

ఆ రైతు లేచాడు. ఆతని వెనుక మరో రైతు, యిదిమామూలు అన్నట్టుగా మిగతవాళ్ళంత లేచిపొయ్యారు.

తెల్లవారడంతోన వంటకోసరం మళ్లిసన్నాహాలు ఆరంభించాడు జవాను. 'కట్టెలేవివి' అంటుమాదిగపైకి ఉరిమాడు. 'అదిగో' అంటు రాత్రె జవాను తలగడవైపు వేసిన కట్టెల మోపుచూయించాడు మాదిగ. సర్కారిపనిఅంటే యిట్లాజరుగాలె— యిట్లాపనిచేస్తే ఎవడురాకొట్టేది. అరేయి! మీరు మామీద ఏడుస్తారు కాని దొరవచ్చినప్పుడు కోమటిమాన్యం యివ్వటంలేదని ఎందుకేడ్వరు. తంతేఏడుస్తారు. ఆకలైనఏడ్వరు మీరు. ఏడ్చేసిల్లకే తల్లిపాలుదొరుకుతాయి. కోమటిని త్వరగాపట్టుకరా' అంటు లెనథోరణి ముగించాడు. 'అయ్యా'. అని తలఊపుతు పోయాడు మాదిగ.

పొద్దుఎక్కుతు పోయింది. ఎవరో పైనుండి వస్తారని నాచేత ఉత్త దండుగ పెట్టించాడు—అవేశంటే ఈవాళ ఆయన వచ్చి తినపోకపోయినాడా' అంటు సామానుయివ్వనని భీష్మించుక కూర్చున్నాడు. కోమటి

'నిన్నరాగా ఆయన్ను ఏవన్నైన ఆపారా-నాగయ్యబావుండమ చూడు! మాదిగవాళ్ళంతె నీకైన ఏడుస్తున్నారు. ఆమాట ఈ మాట దొరచెవిని బడితె'

నాగయ్యతో జవాను ఈమాట అంటూనేఉన్నాడు. అక్కడ కూర్చున్న రైతులంత 'అదిగో! దొర' అంటులేచారు. దూరం నుంచి ఎక్కిన గుర్రం సిందుగా ఉరికివస్తుంది. రైతులంత ప్రక్కలకు తొలగ ఆరంభించారు. కరణం రుమాలు సర్దుకోనదొడగాడు. జవాను బిళ్ళ సరిచూచుకోడగాడు. ఈసందడి

లోకొమటిసామానుఇవ్వటానికి పసుగెళ్తాడు.
గుర్రం నురుగులు గక్కుతూ గబుక్కున వచ్చి చావడిముందు ఆగింది.
'అరేయి-అలీ- దొంగా నీవురాదొరవు. దిగు ఎన్నితంతాలో చూడు' అంటు గుర్రంపై వచ్చిన సైసును నేలకీడ్చాడుజవాను. 'దొర గుర్రంఎక్కినంతసేపు నేనువొరనే' అన్నాడుసైసు. కరణం ముఖం వెల వెల పోయింది. రుమాలు సవరించుకొన్నందుకు నొచ్చుకొని మళ్ళీఎప్పటివోలె ప్రక్కకునెట్టి సైసుకుభయపడ్డా ననే హృదయభారాన్ని దింపుకున్నాడు. సైసుగుర్రాన్ని మాదిగచేతికిచ్చి 'దొరరాకముందు దుమ్ములేకుండ తూస్చేయి. లేకుంటే నీదుమ్మురాలగొడుతాడు దొర. దానా, నీళ్లు, సిద్ధంగా ఉంచావా? నాదేముంది దొర రాకడంతోనె నిన్నేముందుకు తోస్తాను.
'అయితే ఈవాళ వస్తాడుగా దొర?
'వాళ్ళకేమిరా మోటారు. ఎప్పుడంటె అప్పుడు.'
'అయితె నాపనికాస్తా' నంటు అప్పుడేవచ్చిన సామాను తీసుకొని వ టపనిలో మునిగిపోయినాడు.
ఈరోజుగూడ ఎదిరిచూపులతో, గడవవలసి వస్తుందేమొ అని నిరాశతోకృంగిపోయిన రైతులకు సైసుతెచ్చినవార్త కొంచెం ప్రాణం పోసింది.
తమకష్టాలు, బాధలు గూర్చి తాముఎట్లాఆతురత పడుతున్నారో, పైనుండివచ్చే ఆ అధికారికూడ, అట్లాగె ఆతురతపడి ఆచిక్కు లేవోతీరుస్తాడని వాళ్ళంతా ఆయనకోసరం ఎదిరిచూడ దొడగారు. ముఖ్యంగాప్రజలకు పరిపాలనలోని సౌఖ్యాసౌఖ్యాలకన్న, ఆఫీసుభవనాలమీద, అధికారుల వేషాలమీద, ఆల్మారీలలోని

అట్టబెండులమీద ఎక్కువనమ్మకం. తమలోలేనిశక్తి, తమలోలేని న్యాయతత్పరత, వానిలో ఉన్నాయని వాళ్ళుభ్రమపడుతారు. ముఖ్యంగామనిషిలోని అసహాయత, అజ్ఞానమే ఒకనిలోకువతనానికి, మరొకని అధికారానికి దారితీస్తుంది. దేవుడికోసరం ఎదిరిచూచినట్లు, చూడగా, చూడగా, తుదకు మోటారుకుయ్యిమంటు వచ్చింది. మోటారురావడంతోనె రైతులంఎరిని 'దూరం దూరం' అంటు నెట్టివేశాడు జవాను వాళ్ళగాలితగిలితె అధికారికి ఏదో ఉపద్రవం వచ్చినట్టు. రైతులు దూరాన కదలక, మాటలాడక వాళ్లలోవాళ్ళు ముడుమకొని, అధికారివాక్కు వెళ్లితేనె పోదామన్నట్టుగా నిలవబడిపొయ్యారు. అధికారి కరణాన్ని దగ్గరకు పిలుచుకొని ఓకాగితము అందిచ్చి సంతకము చేయమన్నాడు.

తీరికగా స్పష్టంగా, చదివితె అధికారిపైన అపనమ్మకం వచ్చినట్టు ఉత్తర్వచిన్న జేసినట్టు, అవుతుందేమోనని, భయాసనశకే చేతితో పైపైన కాగితంచూచి సంతకంచేసియిచ్చాడు. ఎంత పైపైన చదివిన, ఒక్కొక్క వాక్యం చూచినకొద్ది అతనిముఖం ఏందుకో వివర్ణమైతు పోయింది. కరణం కొంచెం తేరుకున్నాడో లేదోకారు స్టార్టుఅయింది. కారు స్టార్టుకావడంతోనె చేతులు కట్టుకొని నిలవబడ్డ రైతులంతా తమకు వరమియ్యవచ్చిన దేవత ఎగిరిపోతున్నట్టు, అయనపోతె మళ్లి తమకష్టాలు యింతే అన్నట్లు, మోటారు వెనుక పడ్డారు. 'అయ్యామాగతి, మా ఖర్మం' అనే మాటలు అందరినోటగుండా వెళ్ళాయికాని మోటారు ధ్వనిలో ఆయనకు వినబడలేదు. మొటారు దూళి రేపుతు పోయింది. మోటారు పోవడంతోనె కరణం తనపైన ఏదో బరువుపడ్డట్టు ఆబరువేదో జవాను దించుతాడన్నట్టు అతనిదగ్గ

రికి పోయ్యాడు.

'ఏమయ్యా! మళ్లీ కోళ్లు, గొర్లు, కావాలని రాయించుకొని పోయినాడెందుకు. మళ్లీ ఎవరువస్తారు?

'ఎవరురావాలె .... మీకుయింకా తెలియదు'?

'ఏమిటి'?

'దొరగారిబిడ్డపెళ్లి'

'దొరగారిబిడ్డపెళ్లి!'

శరణంచుట్టు మూగిన ఖైదులంతా తెల్లబోయి ఒక్కసారిగా ఈమాటలన్నారు.

# విముక్తి

మేముజైలులో కాలుపెట్టడముతో, అక్కడి పాతఖైదిలలో నూత్నసంచలనం బయలుదేరింది. బాహ్యప్రపంచముతో సంబంధము తెగిపోయిన ఆ నిస్సారజీవితములో ఒకవింత ఆశ పుట్టుకవచ్చింది. ఎవరుచెప్పారో! ఎట్లాఊహించు కొన్నారో.! ఆమాట కాని చదువుకున్న వాళ్ళంత జైలుకురావడము తమను. విడిపించడానికే ననివాళ్ళలో గట్టివిశ్వాసము అలముకపోయింది యికదానితో ఉదయమునుడిం సాయంత్రంవరకు చేయవలసిన అర్థంలేని తమపనులను మరచి ప్రతివాడు ధీమాగతిరిగేవాడు. మొదలు, మొదలు, సూపరెంటెండెంటు బాంబులేమైన చేయ నేర్పుతామేమోనని,భయపడి ఆపాతఖైదీల మాతోకలియనిచ్చే వాడుకాదు. యికఉత్తరానికో, బంధుమిత్రుల కలియడానికో, ఆఫీసుకు పోయివస్తుంటె, ఆఖైదీలు దూరాననిలువబడి 'మాగతి మరిచేరు' అని వార్నింగుయిస్తు ఉన్నట్టు వంగి, వంగి, సలాములు చేసేవారు. రాను, రాను, పరిచయము ఎక్కువైనకొద్ది తాను మొదలనుకొన్నంత ఉత్పాతమైన రహస్యము, ప్రత్యేకత మాలో ఏమిలేదని సూపరెంటెండెంటుకు అవగతమైపోయింది. దానితో ఆపాతఖైదీలపై మోపిన నిబంధనలన్ని సళ్లపడి పోయినాయి.

ప్రపంచవాసనలతో వేరుచేయబడి అక్కడే ఆజైలు గోడల మధ్యనె మట్టిపాలయ్యె ఆదురదృష్టజీవుల మధ్య తిరుగుతున్నప్పుడు, వాళ్ళు ప్రపంచాన్ని అంతగా బాధించిన ఆ మహానేపమేదో, తెలుసుకొన ఉరుకులాడుతు ఉండేవాళ్ళము. యికఅడుగటమే తరవాయి వాళ్ళు అందుకోసరమే పుట్టినట్టు వాళ్ళు

జీవితములో చెప్పతగ్గ విషయము అదేఅన్నట్లు ఎంతో శ్రద్ధగా పార్టిదారు జయానికి, తమ అపజయానికి కారణాలైన ఎం చాలు, శిఫారసులు, పోగా హైకోర్టు సూత్రాలతో సహా సమన్వయంచేసి చెప్పేవాళ్ళు. ఏదోవిధంగా ఆసిర్బంధంనుండి బయట పడాలనే ఆతురతలో, కనపడ్డవాని ముందెల్ల తమదుఃఖాన్ని వెళ్ళబోసుకొని, అదేలోకములో చాలమంది పిచ్చివాళ్లు అయి పోయ్యారు.

ఆనాలుగుగోడలమధ్య యింతసంచలనం జరుగుతుఉన్న గోడ లకు సున్నము వేసే రామసింగు మాత్రము, ఈవిషయాలేవి తన కక్కరలేనట్లు, తన పనిలో తానుమునిగి ఉండేవాడు. తనచుట్టు ప్రపంచాన్ని ధిక్కరించి ఒంటిగా ఉండే ఆమనస్థైర్యము రామసింగుహృదయములో దాగియున్న ఏపబలవిశ్వాసము వల్ల కల్గిందో మాకు అర్థంకాకపోయ్యేది. ఎప్పుడైన మేముఏదు ... తెరమాత్రము ఆనిండుకళ్ళతో నవ్వుతు తలవంచేవాడు. ఏదోప్రత్యేకతను వివరించే ఆకళ్ళు, హృదయాల గుంజుకునే ఆనవ్వుతోనూ అందరిమధ్య రామసింగుకు ఓప్రత్యేక స్థాన మేర్పడి పోయింది.

నీవుపోయినదగ్గరినుండి నీభార్యస్థితి పూర్తిగా అధ్వాన్నంమై పోయిందని ఓరోజు మామగారిదగ్గరినుండి ఉత్తరము వచ్చింది. ఆరోజు తలనొప్పివంకతో వార్డులో నేఉండిపోయాను. దేశ దుస్థితి, ప్రజలదౌర్భాగ్యము, గూర్చి ఎప్పుడు ఏదోఆలోచిస్తు ఉండేవాణ్ణి. కాని ఉత్తరంచూచుకోవడంతోనే, యిన్నాళ్ళ నుండి స్వాతంత్ర్యోత్సాహాలమాటున అణిగిపోయిన పెళ్ళాము పిల్లలపైని మమకారము కన్నులముందుకు వచ్చింది. యిక

దానితో మానవుడు ప్రపంచములో చేయదగ్గపని వేరేలేనట్లు, పెళ్లాముర౦ధి, పిల్లల దేవులాట, ఆఫీసు రాచకము వీనినిగూర్చిన ఆలోచనలె తలనిండి బాధపెట్టదొడిగెను. బయిలుకన్నపోయి ఈబాధలనుండి విముక్తి అవుదామని రెండడుగులు వేశాను. ఎదురుగావచ్చాడు రామసింగు కార్డుచదివిపెట్టమని. కార్డు చూచి "రేపుమీవాళ్లుచూడటాని వస్తారట" అన్నాను. రామసింగు పెదకికదపక కార్డుఅందుకొని ముక్కలుచేస్తు పోదొడగాడు.

'యిలుచూడు రామసింగ ? 'రామసింగుఅగాడు

'ఏమి ఆట్లాచించావెందుకు'?

'చింఛక ఏమి చేయును'?

'ఏమిచేయక పోతెమాత్రము చించాల'?

'కాదంకి! ఎందుకువచ్చనట్టు గాలికి! శిక్షతగ్గిస్తాయా? జైలు విడిపిస్తాయా'?

'తప్పు చేసి ఎవరుతప్పించుకున్నారు రామసింగు'?

'తప్పు చేసినవాళ్లందరిని శిక్షించాలంటె మళ్లి యింతప్రపంచము వెదకాలె జైలుకట్టడానికి'

'యిక నేరాలకు శిక్షలెందుకు'?

'శిక్షవద్దనను. కాని,నన్ను శిక్షించినవాని నేరానికి, నాబోటివాళ్లను శిక్షించమని న్యాయసూత్రాలు కల్పించినవాని నేరానికి, అసలు నాబోటివాళ్ళమీద నేరాలు మోపే వాళ్ళనేరాలకి దండనఉన్నపుడు, నన్ను దండించ డి. కాని శాసనపువు లనుండి, తప్పించుకోలేని నాబోటిధనహీనుల, యుక్తిహీనుల, ఏకొందరినో, ఈచీకటిగదుల్లోత్రోసి, న్యాయపరిపాలన సాగిస్తున్నామని చాటుతున్నాయెప్రభుత్వాలు? అదికేవలం బూటకం'

'ఆ రామరాజ్యం ఎప్పుడైనవస్తుందా'?
'ఈ రాక్షసరాజ్యం నిలుస్తుందా'?
'మనమంత ఏమిచేస్తున్నాము తలవంచక'?
'చేయవలసివచ్చినపుడు ఏమిచేయకఊరకుంటాను'
రామసింగు నాతో మాట్లాడుతు, మాట్లాడుతు, ఏవో ఆలోచ నల్లో మునిగిపోయాడు. అతనిముఖంపై ముడతలు, కనుబొమల విరుపులు, ఏదో తీవ్రనిశ్చయాన్ని సూచింపసాగాయి. అతని ముఖంచూస్తుఉంటె ఈ అపూర్వవ్యక్తికి కూడ ఎందుకు నేరం చేయవలసివచ్చిందో! తెలుసుకోవాలనే కుతూహలంకలిగింది. మెల్లగా రామసి గును కదిపి 'శిక్ష ఈ ఏటితో అఖరేనా'? అన్నా.
'చావుతో అఖరు'
'ఏమిటి నేరం'?
'ఎందుకు భారతమా—భాగవతమా'?
'అటా అనకు రామసింగు. నిజంగా మీచరిత్ర రాయడానికి ఏ వాల్మీకో, వ్యాసుడో పూనుకుంటె వాటికన్న తక్కువవు తుందా'?
'అదికాదు అసలు ఎన్నిగొప్పతనాలున్న పొట్టకు దుడ్డు పెట్టి పనిచేసేవానికి లోకములో విలువలేదు. నేను నాకోసరం, నాఆనంద కోసరం, పుట్టినమాటమరచి నాయజమానికి సేవ చేసాను. నాచిన్నతనంలోనె నాపైన ఈ సేవాభారం పడిపో యింది. యికనాటినుండి నాచుట్టుప్రపంచానికి నేను దూరమై పోయాను. ప్రపంచాన్ని ఓఆటవస్తువగాచూచి ఆనందించె పసి తనములోనే నాకు భయభక్తులు నేర్పబడ్డాయి. యజమాని పిలుపు, అలికిడి, రావడంతోనే, నేనుఉలికిపడే వాణ్ణి. యిట్లా ఆకుటుంబములోని ప్రతిజీవి అదుపుఆజ్ఞలక్రింద నలిగి నేను ఓపని

ముట్టుగా మారిపొయ్యాను. పొట్టకోసరం తను వద్దపడియున్న బానిసలనబడే మనుష్యులకు తమవలెనె ఆకలి, దప్పులు, నిద్రా సుఖాలుంటాయని చాలమంది యజమానులకు తెలియనే తెలియదు. అసలు ఆవిషయాన్ని వాళ్లు ఫీలుచేయరు. అయాచితంగా, తేరగా, వచ్చినవరాయిసైకిలును, గ్రామఫోనును అస్తమానము వాడుకున్నట్టు దినమంతా పనులుచేయించుకుంటారు. చెడిపోతె మూలకేస్తారు. నాకు రాత్రింపవళ్లు నిద్ర ఉండకపొయ్యేది. అర్ధరాత్రి, యింట్లోపెద్దమ్మగారు లేచి యింటి తలుపులు సరిగాఉన్నావేమో చూడుమనేది. గేదెముందు గడ్డి సరిచేసిరమ్మనేది. యింతలోఖర్మంచాలక పిల్లలెవరైనలేస్తే ఆతెల్లవార్లు వాళ్ళనునిద్రపుచ్చడంతో సరిపొయ్యేది. ఆదరణ సానుభూతి, కెదిరిచూడక నిద్రని, ఆకలిని, చంపుకొని జీవితమంతా వెచ్చించిన బానిసకు లభించె ప్రతిఫలమేమిలేదు. చావుకుసిద్ధమైన శుష్కకాయము మిగులుతుంది. యింకాకథ అడ్డంగాతిరిగితె నీతికి, న్యాయానికి, అందనివహత్యకో, లేక నాంలభించిన ఈ నాలుగుగోడలమధ్య శుష్కజీవితానికో పాల్పడవలసివస్తుంది. ముఖ్యంగా లోకానికి అడకువ, పిరికితనము, సహించినంత తిరుగుబాటు. స్వతంత్రతసహించదు. ప్రపంచమంతా తనపరిపాలనలోని యిముడాలని ఆతురతపడే నాయజమానికి ఎన్నడో నాపూర్వులు సంపాదించి విడిచి పోయిన పెరటిపై కన్నుపారింది. యింక రాత్రింబవళ్లు అదే ఆలోచనలో పడిపోయాడుఆయన. ఎందరిద్వారనో రాయబారాలు మంతనాలు జరిపినాడు. నాపూర్వులెవరో సంపాదించి నావరకుభద్రముగాఉంచిపోయిన ఆ నేలను, నేనుఅమ్మలేకపోయాను. పోగా గాదెలోగింజలు, చేతిలోరూకలులేని నాదరిద్రకుటుంబానికి 'నా'

ఆనుకొని ముగియుడానికి అదిఒకటిమిగిలిఉంది. తరాలనుండి దాస్యానికి పాల్పడి ఆ నేలనుమాత్రము మిగిల్చిపోయినారు. నేను నాముందుసంతతి ఆ దేవిధంగా దాస్యముచేసి ఆయనబాకి తీరుస్తామన్నాము. నానేలపైన నేనుకనబరచిన అభిమానము, ప్రేమవల్ల, యజమానికి విషతుల్యమైపోయాను. వేళ కాచుకొని తుదకు ఓచిన్ననేరంమీద పనినుండితొలిగించాడు. తెల్లవారె కోర్టులోనేను, నాపూర్వులు, అప్పుచేసిన మొత్తానికి దావా వేశాడు నిజాన్నిఒప్పుకోవడంతప్ప వేరే తెలియని నాపై డిక్రిఅయింది. వేలములో యజమానిచేతిలో పడిపోయింది ఆభూమి. తెల్లవారితె పనివాళ్ళతో ప్రత్యక్షమౌతాడు యజమాని. యికఆరాత్రి ఒక తీనిశ్చయానికివచ్చాను. నేనుఎట్లాగు నాభూమికిదూరమయ్యాను. "వీణ్ణిమాత్రము యెందుకుతినని య్యాలె" అనుకున్నాను. నీవుచేయబోయ్యేది "శాసనధిక్కారముకాదా"? అనిఅంటారేమొ?

'అవును! ఏవిధంగానైన బ్రతుకు తెరువుకు తోడ్పడని' శాసనాలు ప్రభుత్వము ఉన్నప్పుడు బీదలు శాసనధిక్కారంచేయక ఏమి చేస్తారు. నౌకరినుండితోసేసి, నాకాళ్ళకింది ఆమాత్రము నేలను లాగుకొని, నిలవనీడ లేకుండా చేసినపుడు ఎవడు దేవతమాదిరి వ్యవర్తిస్తాడు! ఎందరెందరుబీదలు, ఆస్తులు, ప్రాణాలు, మానాలు ధనవంతులకుబలిచేసి ఏశాసనము, ఏన్యాయాధిపతి నుండి కడతేరేమార్గముచెప్పక, విసిగి ఏనిర్ణయానికి వస్తున్నారో మనము దినముచూస్తునేఉన్నాము. చేసేది ఏమిలేక తెల్లవారి పనివాళ్ళతీసుకొని పెరటిలోకి వచ్చిన యజమాని అడ్డంగా నిలచి 'బ్రతకాలనివుంటె కదలకు' అన్నాను. యజమాని పని వాళ్ళు బలముచూచుకొని తోసుకొని బోయాడు. ఒక్కటే

వేళ్టుతో తలపగిలి చచ్చాడు. పోలీసువాళ్ళు రావడం, కొరకు ఈడ్చుకపోడం అదంతా మామూలుతంతే. కలిమి, బలిమితో చెవిటివైన కోర్టులకు బీదలఆర్తనాదం ఎక్కడ వినబడుతుంది? నూటికి, కోటికి, సత్యాన్నిచెప్పే వారెవరైనాఉంటే వాళ్ళను విప్లవకారుల క్రిందనో, దేశద్రోహుల క్రిందనో జతగట్టి జైళ్లలోత్రోస్తారు. మీరంతా రావడము అందుకేగదండి. రామసింగు నవ్వాడు.

'మావిషయము పోనివ్వు. కాని నీజీవితమంత ఎట్లాగడవాలె'?

'అప్పుడికప్పుడే పదేళ్లుగడిచాయి. మిగిలిన పదేళ్ళు ఎట్లాగుగడుస్తాయి.'

'అవును! నిస్సహాయుల ఆక్రందన ధ్వనులు పైకిపోక్కకుండా యుగాలె గడిచిపోయినాయి-పదేళ్ళు ఏమిలెక్క'

రామసింగు ఏమిజవాబివ్వక లో, లోన ఏదో గొణుగుతు వెళ్ళిపోయాడు.

రామసింగు బయట కాలుపెట్టాడో లేదో, జైల్లో పెద్ద కల, కలముబయలుదేరింది. ఎన్నటినుండో మండుతున్న అసంతృప్తిని తట్టుకోలేక ఖైదీలంత వార్డరులపై తిరుగబడ్డారు. అలారం నోరుతెరుచిందో లేదో పోలీసు సిబ్బంది ప్రత్యక్షమైంది. ఖైదీలరాళ్లు, యిటుకలకు పోలీసుగుళ్ళు జవాబుయిచ్చాయి. చాలమంది ఖైదీలు గోడలకు ప్రాకుతు పోలీసుగుళ్ళతో నేల కూలారు. అర్ధరాత్రివరకు కాల్పులు జరిగాయి. చాలసేపటికి ఎక్కడిసద్దు అక్కడ అణగిపోయింది. శవాలన్ని హాస్పటలు చేర్చారు. వానిలో రామసింగు శవముగూడవుంది. రామసింగును చూడవచ్చిన పెళ్ళాము పిల్లలకు తెల్లవారి శవాన్ని చూచేభాగ్యము కలిగింది.

# జైలు

దొంగతనము, బందిపోటు, హత్యా, నేరాలు చేస్నవారంతా మనుషులు కారని, వాళ్ళను భయ శంకాదృష్టులతో చూడ డానికి అలవడ్డ ఓ మునసబు సోములకు ఆరు నెలల కఠినశిక్ష విధించాడు.

సోములు చేసిన నేరము దొంగతనము. చేయించింది ఆకలి. శాసనాలు చేసే ప్రభుత్వము, శిక్షించే న్యాయాధిపతి, 'జోహుకుం' అనే పోలీసు మేతరని క్షుదాగ్నికి బానిసలై ప్రపంచము ముందు ఎన్నేషాలతో ప్రత్యక్షమౌతున్నారో అదే ఆకలి సోముల్ను లొంగదీసింది.

సోములు తన శరీరాన్ని, తనగౌరవాన్ని, తనప్రాణాన్ని యిచ్ఛాపూర్వకముగా ఉపయోగించుకొన్నాడు అన్నదాతల చేతుల్లో పెట్టాడు. ఎక్కడో మైళ్ళమీద వేలుసంపాదించె అధికారి సన్నబియ్యముకోసరము పడే అసంతృప్తి యజమానికి తెలిసేది, కాని, తనకళ్ళముందు తనకోసరము బ్రతుకు బలిపెడుతూ ఉన్న సోములు ఆకలి తెలియక పొయ్యేది సోములకు తిండి యెంతతక్కువో తినేవాళ్లు అంత యెక్కువ. పొలమునుండి వచ్చి కడపలో కాలు పెట్టడముతోనే జేరిపోతుల్లాగ కాళ్ళకు, వేళ్ళకు చుట్టుకునే తన సంతానాన్ని చూచి, వీళ్ళంతా యెప్పుడు పుట్టారో అను ఆశ్చర్యము, 'ఎందుకు పుట్టారో' అను విసుగుతో లోలోన ఉడికి పొయ్యేవాడు. నాడు ఖర్మంజాలక యెవడైన చుట్టముకొచ్చి, చేతికర్రతో లాగుకపోయెనా తాను పడే చిరాకంత తలోనాలుగు వడ్డించడములో తీర్చుకునేది. బానిసకు బానిసైన ఆపెళ్ళాము వచ్చి తనను, తనఖర్మాన్ని.

తన నేమహాకార్యము సాధించడానికని పుట్టించాడో, తెలుపని ఆదేవుణ్ణి తిట్టుకుంటు పుట్టినిల్లు దారిపట్టేది.

జైలులో చేరినప్పటినుండి సోముల్ను ఈబాధలేవి అంటడం లేదు. ఒకటి, రెండురోజులు మాత్రము అక్కడి నూతనజీవితాన్ని అర్థంచేసుకునే స్థిమితంలేక, దానిలో కలిసిపోయే సాహసం చాలక, ఒంటరిగా యేవో పిచ్చి ఊహలతో, తలనొప్పితో, కళ్ళతీపుతో బాధపడ్డాడు. నిద్రలో పెళ్ళాము పిల్లల నుతిచేసుకుని వెక్కిళ్ళుతిప్పేవాడు. కాని యజమాని పని, సాహుకారిబాకీ, కుటుంబపోషణ—అనే భయాలు ముప్పిరిగొని ఆ ఆ వేదనను, అసంతృప్తిని అణచిపారేస్తవి.

ఒకటి వెనుక ఒకటి దినాలు గడవ దొడగేయి. ఓనాడు నరక ప్రాయమనుకున్న జైలు బ్రతుకులోనే ఓవిధమైన సంతృప్తి, ఓ విధమైన స్వేచ్ఛ అనుభూతం కాదొడగాయి. కాని జైలంటే నరకమనే భావానికి లొంగిపోయిన ఆప్రాణి, ఆజీవితంలోని సమతాసుఖాల అర్థంచేసుకుని ఆనందించలేకపోయింది. పోగా బయటి జీవితముకన్న బాగానే ఉన్నదని యెవరితోనైన అంటే చీవాట్లు పెడుతారో, లేక తనపేదతనాన్నే పసిపడుతారో అని అనుమాన పడ్డాడు. కాని యెన్నివిధాల ఆనమ్మికను అణిచి పెట్టినా యేదో విధంగా వ్యక్తమాతూనే పోయింది. బయట మహాభోగాలు అనుభవించినట్లు ఖైదీలంత జైలు జీవితము మీద నిట్టూర్పులు తీస్తవారు. కాని పైకి యెంత అసంతృప్తి కనబరచినా అంతరంగములో మాత్రము హాయిగా ఉందనే నమ్మిక, ఇంకేమి కావాలనే నిబ్బరము అణుమాత్రము చెలించక పొయ్యేవి. రాను రాను విడుదల సమీపింప దొడగేయి. జైలులో కాలుపెట్టేటప్పుడు సోములకు ఆరునెలలు ప్రపంచా

న్నుండి తనను పూర్తిగా వేరుచేసే 'ఆరు మహాయుగాలు' గా తోచేయి. కాని వెళ్ళాగడిచాయో ఆ దినాలు. దోసిలినుండి నీరు జారినట్లు నేరకుండా గడచిపోయినాయి.

నక్షత్రోదయము అప్పుడప్పుడే అయింది. పగలంత తమనెంటబడ్డ సుఖదుఃఖాలన్నింటిని మరచి, ఒక రొకటుగా కన్నులు మూస్తున్నారు ఊరివాళ్లు. సోములున్న కానిస్టేబులు ఒకడు తీసుకవచ్చి ఊరిపటేలుతో, యేవోసంత కాలు తీసుకొని వెళ్లిపోయాడు. పటేలు సోములున్న బాగాచూచి, 'మన్నిపాముకు తగిలింది ఊరి' అని నిట్టూర్పు తీశాడు. సోములు ఈ ప్రపంచములోనే లేడు. పెళ్ళాము, పిల్లలు, ఇల్లు వాకిలి, అక్కడనే విహరిస్తుంది అతని మనస్సు. అందరికన్న బాగ సోములుకళ్ళలో గంగడి స్వరూపం వెలుగుతుంది. ఆరు నెలలక్రిందం తాను జైలుకు పోయినప్పుడు గంగడు చంకలో యిరికి, తల్లి మాట్లలిచ్చి చేతులు చాపినా, పోలీసువాళ్లు బెదరించినా ఒక్కమాటానా దిగలేదు. తుదకుసోములే మనసు మొండిచేసుకొని తల్లి ఒళ్లో వేసిపోయాడు. గంగడు తల్లిచంకలోనుండి తప్పుకోవడానికి పడ్డయాతన మతికి వచ్చేవరకు సోములు కూర్చోలేక పోయాడు. పిచ్చి ప్రేమ హృదయము నిండి చల్లని కన్నీరై కనురెప్పలనుండి జారింది. ఆ దివ్యావేశంలో అయ్యా! రాత్రి అయింది. సెలవిప్పించండి అంటు లేచాడు.

'ఎక్కడికి పోతావు'?

'ఎక్కడికండి యింటికి'

'అయిపోయింది? రోజువచ్చి చావడిలో పడుకోవాలె. ఒక్క రాత్రిలేకపోయిన ........'

'ఏమైన చేయండి ..మీయిష్టము.మిమ్ముధిక్కరించిమాత్రము ..

'మేము ఏమిచేస్తాము .... పై ఆజ్ఞలు'
'ఏమైన చేయగలరు .... దయగల ప్రభువులు'
'సరే ఈ రోజుకు వెళ్లిపో–కాని ప్రతిరోజు సాయంత్రము పో. జరి మాత్రము ఇచ్చిపోవాలె'
'అయ్యా! తమ ఆజ్ఞమీరుతానా 'అంటు సోములు లేచి పొయ్యాడు.

తెల్లవారి సోములు యజమానియింటి వైపు పోతూఉంటే ఊరి వాళ్ళంత కదలక మెదలక యేదో వింతమృగాన్ని చూచినట్టు విభ్రమంగా చూడదొడగేరు. అసహ్యము, అనుమానముతో నిండిన వాళ్ళచూపులు, సోములు నిలువెల్ల కుచ్చదొడగేయి. సోములు తానేదో మహానేరం చేసినట్టు భావించుకొని, తన లోని జీవాన్ని, వ్యక్తిత్వాన్ని మరచి, పాదాలు ముందుఅడుగు వేస్తుంటె పోయి యజమాని యింటిముందు చతికిల పడ్డాడు సోములు రావడంతోనే, అక్కడ తిష్టవేసిన పెద్దలు ముచ్చటలు చాలించి, యేదో వినాలనే కుతూహలముతో చల్లపడి పొయ్యారు. బజారున పోయేవాళ్లు యేదో తమాష జరుగుతున్నట్టు దూరాన ఓచెట్టుక్రింద పోగయ్యారు. సోములకు మతి తప్పిపోయింది పైకి తలెత్త లేకపొయ్యాడు. తన దో అగ్ని గుండములో త్రోయ్యబోలని తనచుట్టు ప్రపంచం పొంచి చూస్తుఉన్నట్టు, తాను ఈ ప్రపంచము ఉరులలో చిక్కిన ప్రత్యేక జీవమన్నట్టుగా భావించుకున్నాడు. ఏదో మాట్లాడపోయాడు. గొంతు పెకలలేదు. అతనికి మిద్దెలు, మేడలు, మోటార్లు తెల్లని వసనాలు కట్టుకొని తిరిగే పెద్దలలోకూడ పిరికితనము దాగిఉంటుందని తెలిస్తే ఆ క్షణములో తలయెత్తుకొని తాను 'మానవుడనే' నని ధీమాగా మాట్లాడేవాడేమో. చాలసేపటికి

ఆ నిశ్శబ్దతను తాళుకోలేక 'ఎప్పుడు వచ్చావురా? సోములు' అన్నాడు ఒకాయన.

సోములు తలయెత్తి వెనుకముందు చూచాడు. తెలియకుండానే ధైర్యం ఆవరించింది. కొంచెం కుదుటపడి 'రాత్రిఅయిపోయిందండీ' అన్నాడు.

'మళ్ళీ ఉంటావా ఊళ్లో?'

సోములు వళ్లు మండింది. 'దొరగారికి దయ' యెంతో బాధగా అన్నాడు.

'దయకేము ఎక్కడుంటే అక్కడ' ఏ రాత్రి అంటే ఆ రాత్రి. నాదగ్గరే ఉందా దయ. అంతా! చాలమా మీదయ? మరు స్వామా'?

'చంపేయరాదండి, మాటలెందుకు అనడం'

'చంపేతాహాతు ఉంటే అంతపని ..........'

'చచ్చిపొయ్యేవాణ్ణి మీచేతుల మీరు బ్రతికించారు'

'బ్రతికి ప్రపంచం ఉద్ధరిస్తావని'

సోములు ఇంక మాట్లాడలేకపోయ్యాడు. నిరాశతో అక్కడ కూర్చున్న పెద్దల ముఖాలు చూచేడు. కదలక, మెదలక, ప్రపంచములోకెల్ల తామే పవిత్రాత్ముల మన్నట్టు నిండుగా కూర్చున్నారు వాళ్లంత. నిజంగా ధనము, యుక్తి, పలుకుబడి అనే సమ్మోహనాస్త్రాలు లాగుకుంటే, గొప్పవాళ్లము, నీతిపరులము అనుకునేవాళ్లలో చాలమంది దౌర్జన్యము, దోపిడి, హత్యా నేరాలకింద జైళ్లలో నేజీవితాలు చాలించేవారేమో! పొట్టకూటికై సర్వార్పణమొనర్చిన సోములకు ఈ తత్వాలు

సిద్ధాంతాలు, యెట్లా తెలుస్తాయి? బాధ, జాలి, ఆతురత, యేమిలేని అ మనుష్యుల ముందు నిలవలేక యింటికి మళ్లి పోయాడు.

సోములు యిల్లు చేరుకునేవరకు యింటిముందు సాహుకారు కూర్చున్నాడు. పెళ్లాము సులకపక్కలో మూల్గుతుంది. పిల్ల లంత యెక్కడి వాళ్లక్కడ పడుకొని కళ్లుమూశారు. సోము లు ఆగిపోయాడు.

జైలు ఇనుప తలుపులనుండి బయట కాలుపెట్టినప్పుడు, ప్రపం చమంత నిత్య నూతనముగ తోచింది సోములకు. బజారున పోయే గుర్రపుబండి, చెట్టుమీద కూర్చున్న పక్షి, బరువులు మోస్తున్న మనుషులలోకూడ ఏదో పూర్తిగా అనుభూతము కాని దివ్యావేశము పొడకట్టింది. ఇల్లు, పెళ్లాము, పిల్లల తలు చుకునేవరకు నిలువెల్ల పులకరించింది.

కాని యేది ఆ ఆనందము? ఏది అ దివ్యోత్సాహము? ఏ ప్రభు త్వపు ధనాగారములోనైనా తనతోపాటు మట్టిపాలుచేసే ఏ పిసినిగొట్టు చేతుల్లోనైనా, లేక తనచుట్టు ప్రపంచాన్ని అర్థము చేకోలేని ఏ భోగి చేతుల్లోనైనా ఉంటే అది గరీబుల కేలాఅందుతుంది?

తుదకు ఊళ్లో కూలికూడ దొరకడం కష్టమైపోయింది సోము లుకు. విధిలేక ఊళ్లో చెరువు మరమ్మతు అవుతుంటే అక్కడ కూలిగా కుదురుకున్నాడు. నాలుగురోజులు నిమ్మళంగా గడ చాయి. అంతే! మళ్లీ హఠాత్తుగా దొంగతనం చేశాడనే నేరం మీా దపట్టుబడ్డాడు.

పెళ్ళి సందర్భాన షావుకారు యింట్లో ఓ బంగారు నగ మాయమైపోయింది. ఊరిలో పేరు తనపై యేమి కూలుతుందో అని 'సోములు పోజగులేద'ని, 'ఆ దేసమయాన వస్తువు చోరీ అయింద'ని పైకి విన్నవించుకున్నాడు. నేరాలు చేసి తప్పించుకునే వాళ్ళను విడచి, నేరాలు చేసినట్లు గుర్తించబడ్డవాళ్ళను సునాయాసంగా పట్టుకొని పోలీసు సోముల్ను చితుకకొట్టింది. సోములు ప్రతి అవయవాన్ని పొడచి, నలిపి, చూచినా పోలీసు వాళ్ళకు ఆవస్తువ యెక్కడా కనుపించలేదు. తుదకు ఆజ్ఞలేకుండ ఊరువిడచి వెళ్ళాడనే నేరము బుజువు చేశారు కోర్టులో. బీదలకు బ్రతుకు తెరవు చూపలేకున్నా, ఆ బీదలు బ్రతుకు తెరవు కోసరము యేమైన చేస్తే, ఆ పనులను న్యాయసూత్రాలనే రంగద్దాలతో చూచి నేరాలని శిక్షించే ప్రభుత్వము సోములుకు శిక్ష ఖాయము చేసింది. సోములుకు ప్రపంచోద్ధారకులు, శాంతిదూతలు. నీతిప్రియులు ఉండే ఈ విశాలవిశ్వములో నిలవ నీడలేకుండ పోయింది.

మొత్త ప్రపంచ మంతటిలో అసహ్యముగా చూడబడే దొంగలు దొపిడిగాండ్రకు నెలవైన ఆ జైలే, తన యినుప తలుపులు తెరుచుకొని సోముల్ను లోనికి ఆహ్వానించింది.



# సమాధిస్థలము

ధనికులు బ్రతికిఉన్నప్పుడే దరిద్రుల బాధిస్తారనుకునేవాణ్ణి. కాని చచ్చినతరవాతగూడ దరిద్రుల వెన్నాడుతారని నాకు సమాధి ఆవరణలో కాలుపెట్టినవెనుక తెలిసింది. అసలు నేను సమాధి ఆవరణలో ఎన్నడు కాలుపెట్టలేదు. అదేమిటో! నాకు సమాధిస్థలాన్ని చూడటంతోనె సుఖస్వప్నాల మీద దినాలు పుచ్చే మనిషిఅంతిమదశను గూర్చి జాలిపుట్టేది. మనిషి చావునుమరచిన చావు మనిషినిమరువదు కదా!

మాఊరు ఓపెద్దపట్టణము కాబట్టి ఏమూలనో ఒకమూల, ఎవరో ఒకరు చస్తుఉండేవారు. ఇక ఆ చచ్చినవాళ్లు ధనికులైతే, జనప్రవాహానికి అంతుఉండకపొయ్యేది. ఆచచ్చిన ఆతను వాళ్ళకేదో, దానశాసనము రాసి విడిచిపోయినట్లు, ఆతని యింటిచుట్టు మూగుకునేవారు.

సమాధిస్థలము వరకు ఆచచ్చిన ఆతనువెనుక నడచి చాలమంది తమదుఃఖాన్ని, సానుభూతిని, కనబరిచేవారు. పాపము! ఆచచ్చిన ఆతను యింకా ఎక్కడో పొంచి చూస్తున్నట్లు వాళ్ళంత ఎంతో భయభక్తులతో ప్రవర్తించేది. పూలమాలికలు పైనకప్పేది. ఆయన బ్రతికిఉండగా రెండుచేతులతో ధనము పంచినట్లు, వాళ్ళంత గుడ్డిగా డబ్బు వెదజల్లేది. బ్రతికి ఉన్నప్పుడు చూపించని వదాన్యత, సౌహార్దత, ఆతనుచచ్చి, శాశ్వతముగా నిద్రించపోతున్నప్పుడు చూపించేది. కాని ఆఊళ్లో బీదలుగూడ చచ్చేవాళ్లు. అయిన బీదలు ఈ ప్రపంచములోకి ఎప్పుడు కాలుపెట్టింద, ఎప్పుడు నిష్క్రమించింది, ఎవడికి తెలి

యిక పోయ్యేది.

ఒకరోజు పెద్ద చిత్రశాలముందు నిలబడి అక్కడి చిత్రాల ఒక్కటొక్కటిగా చూస్తున్నాను. ఆచిత్రశాలనిండా విశ్వవిఖ్యాతమహాపురుషుల చిత్రాలున్నాయి. ఎవళ్ళఘనతకు తగినట్టుగా వాళ్లు ఆచిత్రాల్లో కనుపించారు. అవన్నీ చూచినవెనుక అనుకున్నాను ప్రపంచమంతాయింతేనా? యికెవరులేరా ప్రపంచములో గొప్పవాళ్లు? అసలు ఈ ప్రపంచానికి గొప్పతనాన్ని, గుర్తించేసహృదయత, దూరదృష్టి ఉన్నదాఅని. తెల్ల, నల్ల, అంతరవర్ణాల, ధనిక, దరిద్ర, భేదాలతో, ఆత్మను చంపుకున్న యీ ప్రపంచమేనా గొప్పతనాన్ని గుర్తించి శ్లాఘించేది? ఈర్ష్యా, ద్వేషాలనుండి సంకుచితస్వాభిమానాలనుండి విముక్తి అయిననాడుకదా! గొప్పతనాన్ని గుర్తించేహక్కు ప్రపంచానికి కలిగేది. ఏమాటలతో నాహృదయం నిండి నేను ఓ గొప్పవాణ్ణనే భావం నాలో ఏర్పడిపోయింది. నాదారిద్రం, సంఘంలో నాకున్న అల్పమాత్రస్వరూపం, మరచిపోయినా నాక్షణాన. యింటవైపు రెండు అడుగులు వేసానుగర్వంగా. అంతే! యిక కదలలేదు. పది అడుగులదూరంనుండి నాకభిముఖంగా ఓ స్త్రీ రావడంచూచాను. ఆమెచేతుల్లో మృత శిశువు చుట్టబడివుంది. ఆమె చెక్కిళ్ళపైనుండి సంతతధారాగా కన్నీరు ప్రవహిస్తుంది. ఆమెవెనుక బంధువులు, మిత్రులు ఎవరులేరు. ఆ స్త్రీ యింతలోకమున్నా, ఒంటరిగాపోతుఉంది. ఈ విశాల మానవప్రపంచములో ఆమెను 'నా' అనేవారు ఒక్కరులేరు. అయితే ఈ మనుష్యులంతా ఎవరు? ఆమెకుఏమికారా! ఏమి నేను? సిగ్గేసిందినాకు. ప్రపంచాన్ని విమర్శించే ఆతురతఎక్కువ కాని, మనుష్యుడు తనను తాము విమర్శించుకొని త్రావంచు

కొని పోవడం చేతకాదు. పశ్చాత్తాపంగా ఆమెవెనుక నడిచి పోయాను. ఆమెఎక్కడో! దుఃఖపువెల్లువలో కొట్టుకపోతు ఉంది. ఏమి! కొంచెను ఆదుఃఖహృదయాన్ని లాలిస్తె, ఏమి మునిగింది, మెల్లగా ఆమెదగ్గరకుపోయాను.

'ఏవరమ్మా ........ మీం అనార్యయేనా' ?

'ఎవరైతే ఏముందినాయనా'

'ఏమైంది అసలు'?

'పాలు లేవు'

'పాలు లేవు'?

'అవును'

'తల్లివికదు'?

'అయితే ఎమిచేయమంటావు'?

'తల్లులంతా ఏమిచేస్తరు'?

'నాలాటితల్లులంతా ఏమిచేస్తారో, నేను అదేచేసాను.

'అంటే'?

'పాలిచ్చాను'

'ఎవడికి'?

'రాక్షసుడికి'

'ఎవడు నీకొడుకేనా'?

'నా కొడుకు దేవత'

'మరి రాక్షసుడెవడు'?

'నాపాలు తాగినవాడు'

'ఎవరమ్మా ఆరాక్షసుడు'?

'ఓ శ్రీమంతుని కొడుకు'

'ఏమి అతనికెందుకిచ్చావు'?

'యిప్పటికుంటే వీడితోపాటు ........ నేను'.

'అవును నీవు పోయేదానివే. అయిన శ్రీమంతుల కాళ్ళకింద నలిగి ఎంతమంది నిత్యం ఈ ప్రపంచాన్ని విడిచిపోవటం లేదు. ప్రపంచము విశాలమైందే కాని, మానవహృదయము సంకుచితం కాబట్టి ఈ విశాలవిశ్వము కూడ సంకుచితమై పోతున్నది. సమతాదృష్టి నశించిన ఈ సంకుచితప్రపంచములో బలహీనులు అణగిపోతున్నారు. అయిన బలహీనులు అణిగిపోతే ఎవడికేమి?

ఆమె తనసోద చెప్పుతుపోయింది. నేను వింటు, చిన్నదాన్ని గూర్చి ఆలోచిస్తూపోయాను. మాట, మాటల్లోని సమాధి ఆవరణ చేరుకున్నాము. గేటుముందు కాపలామనిషి కునికిపాట్లు పడుతున్నాడు. మారాకడ చూచి ఆతను కొంచముకూడ కదలలేదు. నిర్లక్ష్యభావంగా కూర్చున్నాడు. మాముఖాలు, వేషాలు చూచి ఎవళ్లో అనామకులు. అని అప్పటికప్పుడే గుర్తించాడు. 'శవాలు మోసుకరావడం తప్ప వేరే పనిలేనట్టు గాడుందే' అనిగొణుగుతు మావెనుక నడచి వచ్చాడు ఆ కాపల మనిషి. మేము అతనిరాకచూచి అప్పుడప్పుడే సున్నముతో దిద్దిన ఓగోరి ప్రక్కన నిలవబడి పోయినాము. దూరం, దూరం వరకు ఆలాంటివే చక్కని సమాధులు బారులు తీరి ఉన్నాయి. కాపలామనిషి వచ్చి 'పదండి' అన్నాడు ఆసమాధుల మధ్య నిలవటానికి మాకు అర్హత లేనట్లు. కాపలామనిషిని అనేది ఏముంది! బీదలు ఎవరికి లోకువ కారు? తలవంచుకొని నడిచి పోయినాము. ఆ తెల్లని సమాధివరసలు అయిపోయినాయి. ఆకు, అలము, ప్రత్యక్షమైంది. ఆ ఆకు, అలము మధ్య స్మృతి చిహ్నముకూడ లేని సమాధులు కనిపించాయి. అవన్ని భూమి

లోకి కృంగిపోయి ఉన్నాయి. వాళ్ళు బ్రతికి ఉన్నప్పుడు అణగి ఉన్నవాళ్ళే కాబట్టి, చచ్చిన తరవాత వాళ్ళ సమాధులుగూడ అట్లాగే నిర్మింప బడ్డాయి. కాపలామనిషి ఓ గునపము యిచ్చి వెళ్ళిపోయాడు. ఎక్కడ త్రవ్వను? ఎక్కడ ఏ అనామకుడు నిద్రపోతున్నాడో? ఎవడి నిద్రను భంగపరుస్తుందో ఈగునపపు పోటు? ప్రపంచభారము మోసి విశ్రాంతి తీసుకుంటూ ఉన్న ఆ కష్టజీవుల మళ్ళీ ఏ ముఖముతో నిద్ర లేపడమూ? రాత్రి పగలుగా మార్చుకొని యిదివరకు శ్రమించింది చాలదూ? అయిన ఈ త్యాగిని ఎక్కడ పడుకోపెట్టడమూ? 'సరే కానివ్వ' అంటు ఓ దిక్కు త్రవ్వాను. శుష్కించిన ఎముకలు బైటబడ్డాయి. 'అవును! అయింది. ఏయిల్లాలు దుఃఖచిహ్నమో యిది? ఏపతితుని ఆశాజ్యోతో! బ్రతికి ఉన్నప్పుడు ఎప్పుడో, కన్నీటితో ఈ స్మృతి చిహ్నాన్ని తడిపేవారాయి గావును. గునపముతో ఎముకలన్ని పెకలిస్తే ఆ నిరాశజీవుల గుండెలు చీలిపోవూ?. అంత విశాలంగా ఉన్నాదేగా ఆసమాధులు? వాటి పక్కన ఎక్కడైన పెట్టగూడదూ? మెల్లగా ఆసమాధుల దగ్గరకి నడిచి పోయాను. పాలరాతితో కట్టబడిఉంది ఓధనికుని గోరి. తాను ఆక్రమించిన స్థలము చాలక చుట్టు యినుపగొలుసులతో ఆవరణ పెట్టుకున్నాడు ఆ పెత్తనదారు ఆవాస్తులోకి ఎవడికి రా వీలు లేనట్టు, 'బ్రతికి ఉండగా మీరు చేసినపని యిదే' అని నిట్టూర్పుతీసి ఇంకొక సమాధి ప్రక్కకు నడచిపోయాను. అదో ముత్తైదువది పాపం! ఆయన తనసమాధిచుట్టు పూలతీగల పెంచుకున్నాడు బ్రతికి ఉండగా మనుష్యులకన్న పూలతీగనే ప్రేమించినట్టు, యింకా ముందుకుపోయాను. ఓ మేజరు నిద్రపోతున్నాడు. తాను యుద్ధాలుచేసి ఆక్రమించుకున్న భూభాగాల్లాగానే,

ఆ అనంతమైన సువిశాల భూభాగాన్ని ఆక్రమించుకున్నాడు. అపరాధిపత్యం బలమైన రాతిగోడ పెట్టబడిఉంది యింకా ఎప్పుడో శత్రువులు మిగిలిఉన్నట్టు. యింకా ముందుకుపోయినాను. ఆ అంతమైన అసమూహములన్నీ కలియతిరిగాను. స్థలమంతా కాని ఎక్కడా అధికారులక్రింద, ఆక్రమింపబడి ఉంది. ఎక్కడ చూసినా ఎవరి అధికారము అద్భుతంగా ఉంటుందో! ఎవరికోసం తన తాపో? చచ్చినవాళ్లమీద యింకా బ్రతికిఉన్నవాళ్ల అధికారం ఉంది. చచ్చినవాళ్లందరు సమానులైన బ్రతికిఉన్నవాళ్లు ఒప్పుకోవద్దు. తలవంచుకొని ఆమెవద్దకి నడిచిపోయాను. ఆమె నిరాశగా నేను మరలరావడంచూచింది. ఏమి మాట్లాడలేదు. చంటివాణ్ణి ఎత్తుకొని బయలుదేరింది. 'ఏక్కడికి?' అన్న 'ఎక్కడికైన పోదాము' అంది. 'సరే' అని ఆమెవెనుక బయలుదేరాను. మృతశిశువును మళ్ళీతీసుక పోతుఉంటే తన యిసుమంతబుణ్యాలు పోయినాయనే కోపంలో మామీదికిలేచాడు కావలామనిషి.

'బయట ఎక్కడ పెడుతారు శాసన విరుద్ధం జాగ్రత్త' అన్నాడు.

'అవును! యిష్టము వచ్చినంతస్థలము ఆక్రమించుకోవడం శాసన విరుద్ధం కాదు, కాని యిష్టమువచ్చినచోట్ల శవాన్ని పూడ్చడం శాసనవిరుద్ధం కదు'? అన్న.

'అనుభవిస్తారు పొండి'

'యిప్పుడు అనుభవించేదానికన్న ఎక్కువనా'. కావలా మనిషి మాట్లాడలేదు. మేము చీకట్లో నడచిపోయాము. పట్టణము వెనకపడిపోయింది. దూరం, దూరం, వరకు మనిషి అలికిడికూడ లేదు. అంతా నిర్జనప్రదేశం. పంచభూతాలుతప్ప యింకెవరు

చూడటం లేదు. ధనికుల అధికారం, రాజస, దరిద్రుల అస
హాయత, నూన్యత, యివి, ఏవి లేని ఆ నిర్జనప్రదేశంలో ఆ
బాలుణ్ణి భూదేవి ఒడిలో వేసి ఒప్పేసినట్టూర్పు తీసాను.

---

# చిన్ననాటిబుణము

లక్ష్మికి పిల్లలంటే తీరనిప్రేము. అంత లాలన, అంత ఆతురత,
ఆపిల్లమీద యెందుకో! ఆ లక్ష్మికే తెలియకపొయ్యేది.
వరదలో కలసి ఎగురుతుపోయే తుంగదుబ్బమాదిరి లక్ష్మి ఆ
ప్రేమప్రవాహాన కొట్టుకపొయ్యేది.
నాకప్పటికి ఏడేళ్లు. ఆడుకోకుండా బడికి యీడ్చుకపోయే
పంతులు, పంతుల్ను జీర్ణించుకోలేదని రాత్రింబవళ్లు పోరే
యింటివాళ్లు. 'శప్ప' నలర చేత దుమికే బెత్తం, చదువును ఓ
భూతాన్ని చేసి దానినుండి నన్ను విముఖుణ్ణిచేసాయి. నేను.
నాలాంటి ప్రవాసితులు కొంపకు పాతగోడల్లో, చేలగుంటల్లో
ఆడుకునేవాళ్లము. ఆటల్లోమునిగి ప్రపంచాన్ని, పంతుల్ను'
మరచిపోయే వాళ్లము. అంటే మనసులో మండుతున్న
కోపాన్ని అణచుకొని సడిలేకుండా వచ్చేపంతులు ధ్యాసకూడ
ఉండకపొయ్యేది. అటువంటి సంకటసమయాల్లో లక్ష్మి మమ్ముల

కాపా డేది. ఎట్టాచూచేదో? ఎక్కణ్ణుంచి చూచేదో? పంతుల్ని. దివ్వున ఎగిరివచ్చి 'పంతులు వస్తున్నాడు—లేండి—లేండి' అంటు మమ్ముల నలుదిక్కుల తరిమివేసేది.

ఒకరోజు లక్ష్మి, మేము మిరపచేలో, వంటసంరంభంలో మునిగి ఉన్నాము. ఏగోడ –యితే పంతులుకు మేము కనపడకుండా అడ్డంగా ఉంటుందనుకున్నామో, అదేగోడ పంతుల్ని మాకు కనపడకుండ చేసింది. అప్పటికీ ఓ పహారావాణ్ణి తోట గుమ్మములో కావలి ఉంచాము. కాని ఏట్లావచ్చాడో! ఆపంతులు కిక్కురుమనకుండా కావలి ఉన్నవాని నోరుమూసి. బల్లోకిపంపి మాపైన విరచుకపడ్డాడు.

మేమంత తలలువంచుకొని యుద్ధఖైదీలవలెతిరిగ బళ్ళోకిపోయాము. లక్ష్మి వెనుకాలనేఉంది. చావుదెబ్బలుతింటు ఉన్న లక్ష్మి ఎదురుగా ఉ దంటే అందరికి ఓ విధమైన రలీఫ్. పోవడం, పోవడంతోనే మొండిపుల్లాయను కోదండం ఎక్కించాడు పంతులు. దానికో కారణముంది. బళ్ళో పంతులుచావమోదినా మొండి పుల్లాయెశరించి ఒక్క కన్నీటిచుక్కైన రాల్చేవాడు కాదు. కాని బడివిడవడముతోనే పంతుల్ని రాళ్ళాసిరొట్టుతిట్టు కుంటు, పిలకను, ఎత్తుపళ్ళను, వెక్కిరిస్తు పారిపోయేవాడు. ఒకటి రెండు, నిమిషాలుగడిచాయి. పంతులుముఖము చూస్తె ఎంతో పట్టుదల కనుపించింది కనీసం ఒకకన్నీటిచుకైన నేలరాలంది దింపనన్నట్టుగా చూస్తున్నాడాయన. పుల్లాయె తల ఉరి తీసినట్టు నేలకు వంగిపోయింది. ముఖంమీద దైన్యము అనేదేలేదు. నిమిషాలుగడచి పోతున్నాయి. నేను లక్ష్మిముఖము ఏదో ఆశతో చూస్తు కూర్చుండి పోయాను లక్ష్మి పుల్లాయెముఖం దీనంగా చూస్తుంది. కనురెప్ప పడడంలేదు. నిండుగాఉన్న ఆ కనుగుడ్లు

పైన కన్నీళ్లు మెరుస్తున్నాయి. లక్ష్మి ముఖం అలా చూస్తూ ఉంటే నాకు తెలియకుండానే నా కళ్లలో నీళ్లు కమ్మాయి. లక్ష్మి నాముఖము చూచేవరకు దుఃఖముచే వళ్లంత కదలిపోయింది. చెక్కుల పైనుండి రెండు కన్నీటిచుక్కలు జారాయి. నా ఏడ్పుచూచి లక్ష్మి ఏడ్వటం మొదలుపెట్టింది. లక్ష్మిని చూచేవరకు పెద్దగా ఏడ్పువచ్చింది నాకు. నేనుఏడ్వడంతోనే ఎప్పటినుండో (Guide) కోసరము ఎదిరిచూస్తు ఉన్నట్టు నా వెనుక రాగాలుతీసారు పిల్లలంతా. ఏడ్పులన్ని కలిసి పెద్దగోల అయింది. అన్నిటికంటె ఆశ్చర్యమేమిటంటె ఎన్నడు ఏడ్వని పుల్లాయె మా అందరికన్న పెద్దగొంతుకతో భేరుమంటు కోదండం విడచి నేలకూలాడు. పంతులు కిక్కురుమనలేదు. విజయగర్వముతో నిండిన ఆదుఃఖములో పంతులు అక్కడ ఉన్నమాటే మరచిపొయ్యాము.

లక్ష్మికి ఊరివాళ్లంత పరిచయం. ఎవరియింట్లోనైన పిల్లలుంటం డినీయండి, ఎత్తిముద్దాడేది. ఆసందర్భంలో తనను సాకుతు ఉన్న అన్నదాతలు, వాళ్లకు చేయవలసిన విధులనుగూడ మరచిపోయ్యేది

లక్ష్మితలిదండ్రులెవరో ఎవరికి తెలియదు. ఎప్పుడో లక్ష్మిపసిదిగా ఉన్నప్పుడు అన్నాతురులు ఆ తలిదండ్రులు అమ్ముకొని పోయారు. కాలుకు, కాలు, చేయికి, చేయి, దేనికద విడిగా అమ్మే వీలుంటే ఈ అన్నాతురులు ఏమాత్రము సంకోచింపక అమ్ముకుంటారు. అసలు బీదలు చేయలేనిపని, ధనికులు కానిచేనివస్తువ. ఈ ప్రపంచములో ఉన్నయా యని?.

చిన్ననాటినుండి యజమానుల యింట్లో పెరగబట్టి. లక్ష్మికి వాళ్ళుచూపే అధికారం, వాళ్ళు చూపే అనాదరణ, వాళ్లు

మోహపేపని, నిత్యవిషయాలై పోయినాయి. మానవత్వముకన్న, రాగిడబ్బులనుఎక్కువగా పూజించే ఆళిశ్రీమంతులు, కంచాలవద్ద మిగిలినకాయగూరలు, వెంగిలిమెతుకులు, వేస్తేవారు. మిద్దెలు, మేడలు, బంగారునగలు, అందమైన ముఖాలుగల వాళ్ళంత దేవతలనుకునేది లక్ష్మి. యిక వాళ్లు ఎంతఅహంభావం, ఎంత పిశాచత్వము కనబరచిన తనకుఅంటనట్టుగానే నవ్వుతుతిరిగేది.

యింతలో నాపల్లెటూరు చదువు అంతం కావడంతో, పట్టణ వాసం మొదలైంది. దానితో యిల్లువాకిలి, లక్ష్మి, స్నేహితులు వీళ్లంత వెనకపడిపోయారు. హోటళ్ళు, సినిమాలు పంట్లాములు, ప్రొఫెసర్లు, అంతా సన్యాగులమని గర్వించ జేసే ఓ నూతన వాతావరణములో కలసిపోయాను.

వేసంగి సెలవులకు యింటికి వచ్చేవరకు రాత్రిఅయింది. రావడంతోనే నాల్గుమెతుకులు నోట్లో వేసుకుని, ఆరుబయిట కన్నులుమూసాను. అమ్మ నిత్యం క్లాసల్లో ఏమేవంటకాలు చేసుకుంటారని పెయ్యిసగ్గావేస్తారాఅని, యింకేమేమొఅడుగుతుంది. ప్రతిదానికి 'ఊ' అంటు ఏదో స్వప్నలోకములో విహరించపోతున్నాను 'అమ్మా', 'అమ్మా' అంటు ఎవరో ఆతురతగా పిలుస్తు తలుపు తోసారు. కళ్ళు తెరుచుకున్నాయి. ఏదో స్మృతి తళుక్కున మెరిసింది. ఆదరా, బాదరా, పోయి తలుపుదీసాను. కన్నినిండనీళ్లు ...... లక్ష్మి. దిగ్భ్రాంతుడనై వెనుకకు తగ్గాను. లక్ష్మి తననెవరో పట్టుకోవస్తున్నట్టు గబుక్కున లోనికి వచ్చి తలుపులు వేసుకొని అట్లాగే నిలచిపోయింది.

'ఏమిటిలక్ష్మి'? హృదయములో ఉన్న ఆబాధ, హృదయములో ఉన్న ఆమాట ఒక్కసారి గ్రహించాలన్నట్టు అడిగాను.

లక్ష్మి తనతపులు తన దుఃఖాగ్ని మీద కన్నీరు గార్చేవారెవరో, ఎదురుగా ఉన్నట్టు వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఆక్షణములో నాచక్కని వేషాన్ని, చదువుకున్నానని ఉప్పొంగే నాక్షుద్రగర్వాన్ని మరచి ఏవిధమైన అహంలేక పుట్టి, చచ్చే మామూలు మానవుణ్ణి అయిపోయ్యాను. తన చుట్టు ప్రపంచాన్ని మరచి అచేతనంగా కన్నీరు కారుస్తున్న లక్ష్మిని చూస్తుంటే ధనికులు, బీదలు, అధికారులు, బానిసలు లేని ఏదివ్యప్రపంచములోనో విహరిసున్నట్టుతోచింది. స్త్రీని చూడటంతోనే మామూలుగా పుట్టేఆవేదన, మంట, సురిగి, విరిగి, వరస, వాయి కందని ఓదివ్యప్రేమ నిలువెల్ల నిండిపోయింది.

భుజముతట్టి లేపుతు 'లక్ష్మి యిటుచూడు' అన్నాను.

ఆచల్లని వెన్నల్లో నీళ్ళు నిండిన నాకన్నులు మెసాయి కావచ్చు. లక్ష్మి తలవంచుకుంది.

'ఏమిటి'?

'నాఖర్మం'

'చెప్పవు'?

'లక్ష్మి ఎంతో కష్టంగాచెప్పింది, తనశరీరము కోసరము, తన అందము కోసరము, ప్రపంచములోఉన్న స్త్రీ సౌందర్యమంత తన చేతులక్రింద నలగిపోవాలని ఆతురపడే ఓ ఉన్మాదిపెడుతున్న బాధలు. కాని అన్నిటికన్న ఎక్కువగా తనను సాకినయజమాని నౌకరులతో లక్ష్మిని బలిమిగా నరకజ్వాలలు రేగుతుఉన్న ఆ ఉన్మాదిగదిలో తోయించిన విషయము విని నాశరీరము, నాశక్తిని, మరచి ఎక్కడో అధోలోకాన పడిపోయాను. చైతన్యరహితమైన ఆ నిర్జీవావస్థలో, అలాగే

కన్నులు మూతలుపడ్డాయి.

కొన్నాళ్లకు లక్ష్మి ప్రపంచానికి అక్కరలేని ఓ నిసుగును కన్నది. తను అక్కర తీర్చుకొని, దానినుండి కలిగే ఫలితము మీద బాధ్యత వహించని లోకానికి లక్ష్మి ఆ పాపను చూపు తుతిరిగేది.

చేయిచేసుకున్న పెద్దలంత తాము అటువంటి విషయాల్లో జోక్యము తీసుకోనట్లుగా ఆ నిసుగును ఎక్కడో ఎడంగా నిల బడి చూచేదివారు.

ఒకసారి సెలవుల్లో నేను యింటికి పోయినప్పుడు లక్ష్మి ఆపాపా యిని తెచ్చి నన్ను చూపుతు 'నాన్న' అంది.

ఎట్లావచ్చిందో! ఎందుకువచ్చిందో! ఆ ముక్క. అకస్మాత్తుగా అనేసింది. నేను లక్ష్మి ముఖంచూచి నవ్వాను. లక్ష్మి కళ్లలో నీళ్లు నిండినాయి.

యింతప్ప నుండి అవ్యక్తముగా నాకోసరము, జాలిపడి ఏడ్చి, రాల్చిన కన్నీటి చుక్కలు వృథాగాపోలేదు. అవి నాకు తెలియ కుండా నేనా ప్రేమాంకురాలకు ప్రాణాలు పోసాయి. యింత ప్పటినుండి పెరుగుతువున్న ఆ ప్రేమ నాలో పిక్కటిల్లిపోయింది. 'లక్ష్మి యిటుచూడు' అన్న.

హృదయ బాధను కనుక్కొని, ప్రేమించి, లాలించే నేను తండ్రిని కాకపోతే మరెవడు? అన్న.

లక్ష్మి ఆశ్చరంగా నాకళ్లలోకి చూస్తు మూగదానిలా నిలవబడి పోయింది.



# ఒంటరిచావు

---

ఆ జొన్నవిత్తులకు పుటకలోనే జాతీయాభిమాన మంకురించింది. అప్పుడప్పుడే స్వరూపాలు ఏర్పడుతున్నాయి ఆ విత్తులకు. పెద్దగాలి చుట్టుకుంది. నిమిషమాత్రంమైన స్థిమితంగా నిలవబడనీయక కిందుమీదుగా ఊపివేసింద ఆ గాలి. అప్పుడా విత్తుల్లో ఘనమైంది యిట్లాఅంది "మనము కొంచము అంకుర ప్రాయంగా అయినాము లేదో గాలి చిచ్చులా చుట్టుకొని ఊపుతుంది. మనము యింకా కొంచము బలంగా అయితే దాని ఆటలు సాగనని తెలుసు. గాలి ఎంతైన ఊపనీయి. మనము ఒక్కొళ్ళము దానిమాయలో పడనొప్పు. ఎప్పటినుంచి కాచుకొని చూస్తుందో మరి? గింజలు యిట్లా తమలోతాము గుసగుసలు ఆడుతున్నాయి. గాలి నేలకు విసిరింది ఆ మొక్కను.

"చూశారా? ముండగాలి.....ఎట్లా ప్రతాపము చూపుతుందో! ఆడుతుంది గొంతుకోయాలని జాగ్రత్త పట్టువిడిచేరు. బాగ పట్టుకోండి. ఎంత ఎగురుతుందో చూద్దాము" అని ఆ ఘనమైనగింజ అన్నిటిని హెచ్చరించింది. గాలిఊపింది, నేలకు విసిరింది, వేళ్ళదగ్గరనుండి పెళ్ళగిలేటట్టు ప్రళయనృత్యం చేసింది. గింజలన్ని మౌనంగా ఆ భీభత్సాన్ని ఎదుర్కొంటూ ఉన్నట్టు గాలి నేలకు వంచితే చక్కాలేచి నిలచాయి. తమ అణుమాత్రమైన జీవాలన్నిటిని కేంద్రీకరించుకొని గాలికి ఎదురుతిరిగాయి నీవు ఎంత వంచిన నీముందు వంగేది లేదన్నట్టుగా లేచి చక్కానిలబడ్డాయి. గాల మరీ విజృంభించింది. గగ్గోలు చేసింది. 'కాఁగీయి!' అన్నాయి విత్తులు'. నీ ఊపిరితిత్తుల్లో

ఆఖరు శ్వాస లేకుండా ఊదేయి. మూల మూలల ఉన్న నీబలాన్ని అంతా పైకి తోలు. జం కేదిమాత్రము లేదు. గాలి విసిరి విసిరి, తనప్రయత్నాలన్నీ వ్యర్థమైపోయినట్లుగా వెళ్ళిపోయింది. కాలమేఘము పైనుండి తొంగిపోయినట్లు అమ్మయ్య అని నిట్టూర్పులు తీసాయి విత్తులు. విజయగర్వంతో అవన్నీ ఉబ్బిపోయినాయి. వాటి అణువు అణువులలో సంతోషజ్వాల పరువులు పెట్టింది వాటిలోని ఆ ఘనమైనవిత్తు జాతీయ ఉద్రేకంల్లో "సోదరులారా!" అని తలిమ్మా వాటిని హెచ్చరించింది. "చూశారా! జాతీయతలో ఉండే బలము? జాతీయత గల ఒక అణువు బ్రహ్మాండాన్నిగూడ ఎదిరించవచ్చుననే విషయము యీరోజు ఋజువైంది. మన యీ చరిత్ర సంఘటనను మరవగూడదు. మన యీ సంఘటనను మరిస్తే మనజాతీయతే నశిస్తుంది. మనజాతీయత నశించిన్నాడు మనమే నశించిపోతాము" అంటూ ఉపన్యాసాన్ని ముగించింది.

తెల్లవారి దాంనిపోతూవున్న ఓపదుమ ఆ కంకి విరిచి కర్రంలో విత్తులురాలుస్తు ఉంటె అకస్మాత్తుగా ఆ బలిసిన విత్తు ఆమె తలవెంట్రుకల్లో రాలింది. పరిమళాలు వెదజల్లుతున్న ఆమె కేశపాశములో చిక్కుకొని, ఏదో దివ్యలోకములో పట్టాభిషేకము అయింది ఆ విత్తుకు. సువాసనలో మైమరచిపోయింది. అణువు అణువులో ఆ పరిమళాలు నిండగా తన్మయావస్థలో సోల్లాడింది. పట్టుకుచ్చుల్లావున్న ఆ వెంట్రుకలు మెత్తగా సోకగానే "ఎవ్వరే నన్ను పోకుండ ఆపేది" అని తలవెంట్రుకల ముద్దాడింది. "ఏమైన కానీయి. నే నీలోకాన్ని మాత్రము విడచేది లేదు. నాలో ఏదో ప్రత్యేకత ఉండబట్టె నా కీస్థానం లభించింది. లేకుంటె యింత మెత్తనిశయ్య, యింత చక్కని పరీ

మళాలు ఊరకనే లభిస్తాయా? మొదటినుండే యీలాంటిపదవి ఎప్పుడో లభిస్తుందని నాకు తెలుసు. నాలో ఉన్న గొప్ప దనమే నన్నిట్లా బయటికి తీసుకవచ్చింది. ఎంత అధములమధ్య ఉంటేమాత్రమేమి! ప్రతిభ ఎన్నటికైన జీకటిని చీల్చుకొని బయటికి వస్తుంది" యిట్లా తనలో తాను ఉబ్బిపోతూ గర్వం గా కిందికిచూచింది ఆ విత్తు. కర్ర దెబ్బలకు నేల రాలి చిందర వందరగా పడివున్నాయి విత్తులన్నీ.

"వీటికి ఏనాడో యీగతి పట్టుతుందని ఆనాడే అనుకొన్నా, అల్పప్రదేశాలు కాళపోతే ఏమిటీ వీటిజాతీయత? ఐకమత్యం లోపించిన తమతప్ప ఎందుకు పనికివస్తుంది జాతీయత! దయాధర్మము మీద ప్రపంచముంటే దారి దొరకాలెకాని యీపోట్లాటలతో ఏమవుతుంది? ఏమి నాకు పోట్లాడేశక్తి, సాహసము లేకనేనా యిట్లా వచ్చింది? నేను నాలాంటివాళ్ళ నెందరనో నిప్పు తొక్కిన కోతులమాదిరి ఎగిరించగలను. జాత్యభిమానమనే నిప్పు యింటింటికి అంటించి అవి మండుతూవుంటే దేశ భక్తిలో మునకలు వేయగలను.

"స్వనాశాన్ని పురికొల్పే యీ జాతీయాభిమమానమనే సారా యిని ఏపిశాచమో కల్పించి వుంటుంది. లేకపోతే దీనిసర్శ తగిలిన ప్రతిజీవము శివమెత్తినట్లు ఎందుకు పరుగులు పెడు తుంది? అయినదేదో అయిపోయినది. యిక వీటిని దారికి తీసు కువస్తాను. ఒంటరితనములోవున్న సౌఖ్యాన్ని, స్వేచ్ఛను రుచి చూపిస్తాను. యేమి మేమంతా ఒకళ్ళ నొకళ్ళము అంటుకొని పుట్టామా? అయితే యికెందుకు జాతీయత? జాతీయతయని ఏదో మునిగిపోతున్నట్టు పెద్దగా అరవడం? ఏదో నా వివేకాన్ని

బట్టి నా కీస్థానం లభించింది. ఇక వీటితలల్లో చొచ్చిన ఆకు ల్లును లాగి పారవేస్తాను. ఎవ్వాళ్ళంత, వాళ్లు ఉన్నతపదవు లందుకోవడంలోనే నిజమైనసుఖం వుందని బోధిస్తాను. అంతకూ వినకపోతే ఆకలికి మాడ్చి దారికి తెస్తాను! అంటూ దర్పంగా కిందరాలిన విత్తులవైపు చూచింది. కంకినుండి విత్తులన్నీ రాలి పోగానే నేల రాలినవాటి నన్నిటిని మూటగట్ట దొడగింది పడుచు. తలపైవున్న గింజ బాగా చూచింది.

"ఇక తెలుస్తుంది వీటిపరిభావము? జాతీయత అంటే ఏమిటో రుచి చూపిస్తాను. ఒకదానిపై ఒకటిపడి ఉక్కిరిబిక్కిరి కావాలె. గుక్కతిప్పకుండా లో, లోన ఉసికిచావాలె. చూడు తమాషా!" అంటూ పడుచు వెన్నుపై వేసుకున్న కొంగు ముడివైపు బాగా చూచింది. గట్టిగా బిగసినముడి చినిగి ఒక్క టొక్కటిగా పారిపోతున్నాయి విత్తులు.

తనప్రియత్నమంతా వ్యర్థమైనట్టు వుడికిపోయింది విత్తు "దేశ ద్రోహులు ముడిచించుకొని పారిపోతున్నారు. వీటిని పట్టు కొని మళ్ళీ బంధించాలె. లేకుంటే దేశములో మళ్ళీ అరా చకం వ్యాపిస్తుంది. శాంతి మంట కలుస్తుంది." అంటూ కిందుమీందుగా తలపైన ఎగిరింది. జారిపోతున్న విత్తులన్నీ దాని తొందరపాటు చూచి" ఏమైంది? 'ముందు వుంది నీగతి' అన్నట్టుగా దానివైపు చూచాయి. స్వేచ్ఛగా జారిపోతున్న ఆ

విత్తుల చూచేవరకు 'అయ్యో! ఒంటరిదాన్ని అయిపోతున్నానే' అనే భయం పుట్టింది. 'మళ్ళీ ఎట్లా పీటిలో కలవను' అనే ఆరాటం బయలుదేరింది. అక్కడినుండి లేచిపోవాలని అ వెంట్రుకలన్నిటిని విదలించ దొడిగింది.

ఇంతలో పడుచు ఇల్లుచేరి పొయ్యిపైన కంచుడువేసి కొంగు విప్పి చూసుకొంది. ఒక్కవిత్తుకూడ లేదు. 'అయ్యో ఖర్మమా!' అని నిర్ఘాంతపోయి తల దురద పెడతూవుంటే గోక్కుంది. గోక్కోవడంలో ఆ ఘనమైనగింజ వేళ్ళమధ్య చిక్కింది. ఎర్రగా కాగివుంది పెనము. గోళ్ళతో అట్లాగేతీసి ఆ పెనములో పడవేసింది ఆ విత్తును. హృదయాన్ని చింపుకొని ఏమోఅనే పోయింది కాని ఆ ధ్వని బయటికి రాకముందే మాడి మసి అయిపోపోంది ఆ విత్తు.





| | |
|---|---|
| మనసు ఫౌండేషన్ | |
| పుస్తకాల పరిశీలనాపట్టిక | |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 109 B 108 |
| పుస్తకం పేరు | జైలు |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | A.Swini |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | K Naveen |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |